# ముకుందరావు

[ చెడుగులో మంచి ]

జనార్దనరావు

గాంధీ పవర్ ప్రెస్,
పెద్దాపురము.
1951

1/8

# ముకుందరావు

[ చెడుగులో మంచి ]

రచన :

కొత్త జనార్దనరావు.

1951.

# ఒక మాట

సాధారణంగా మానవసమాజంలో ఎక్కువమంది జీవితావసర వస్తువులు లేకుండా దుర్భర దారిద్ర్యానికి గురిఅయి నప్పుడు, కొద్దిమంది ప్రజానీకాన్ని నిర్దాక్షిణ్యంగా దోచు కొంటూ పెట్టుబడిదారులుగా మారినప్పుడూ సంఘంలో అసూయ, అసమానము, దౌర్జన్యము, దోపిడీతనము, నిర్దాక్షిణ్యమూ మొదలుగాగల గుణాలు రెండు తరగతులకూ కలుగుతూవుంటాయి. పరిస్థితులు ఇంకా దుర్భరరూపం దాల్చినప్పుడు పరిణామదశలో సమాజం విభిన్నశాఖలుగా మారి పరస్పరవిరుద్ధభావాలతో ప్రబలుతూంది. మానవసమాజంలోని వ్యత్యాసం అధికతరమై అనివార్యమై నప్పుడు సమాజం విప్లవాత్మకమైన మార్పులను దాల్చుతుంది. అందుకే Abraham Lincoln 'This country belongs to the people who inhabit it Whenever They shall grow weary of the Existing Government, They can exercise the constitutional right of amending it or the Revolutionary right to dismember or overthrow it.' అన్నాడు అంటే ప్రజలు ఎప్పుడైతే పరిపాలకుల శాసనాలను సహించలేకపోతారో అప్పుడు అధికారంలోవున్న వారిని విప్లవాత్మకంగానో చట్టబద్ధంగానో పదభ్రష్టులను చెయ్యవచ్చు. మంచి ప్రభుత్వం వుండేటట్లు చూసుకునే బాధ్యత దేశంలోవున్న ప్రజాసముదాయందే కనుక.

ఏమైనా ఆర్థిక వ్యత్యాసం అధిగమించిపోయేకొద్దీ సమాజంలో చెడుఅలవాట్లు కలుగుతాయి. అధికధనసంపత్తత (అవసరానికి పైబడ్డ ధనం)లోను, దుర్భర దారిద్ర్యంలోనూకూడా సహించరాని చెడుగూ, సంఘవిద్రోహక

పురోగామిగా వుండాలి.

ఆవిధంగా మానవుని గుణగణాలు మంచి, చెడ్డ అన్నీ వాతావరణాన్ని బట్టి వుంటాయని సంఘపరిస్థితులలో పరిణామం పొందుతూ మానవుడు ఒక్కొక్కప్పుడు సంఘాన్ని మార్చగలుగుతాడని నిరూపించడానికి యీపుస్తకం వుద్దేశించబడింది. కలిగిన సత్తాన్ని కష్టాన్ని సమన్వయించుకొని మానవుడు ఒక్కొక్కప్పుడు సంఘాన్ని మార్పుచేయ గలుగుతాడని చెప్పడానికి యీపుస్తకం వుద్దేశించబడింది.

సంఘములో ధన కారణంగా ఒక అమ్మాయికి వేరొక సామాన్యునిపై ప్రేమవున్నా పెండ్లి చేసుకోటానికి వీల్లేని పరిస్థితులు వున్నప్పుడు ఆఅమ్మాయి బలీయమైన మనోభావపరిస్థితులను కల్పించుకొని అతనితోటే వుండటానికి ప్రయత్నిస్తుంది. అదేవిధంగా ప్రతీది మనం తప్పని వారించి నా పరిస్థితుల కారణంగా తప్పనిసరిఅవుతూ వుంటాయి.

# కృతి

ఈపుస్తకం, దేశంలోను విదేశాలలోను సోషలిస్టు ఉద్యమానికి దోహదమిచ్చి, వైజ్ఞానికంగా అఖండఖండాంతర ఖ్యాతి గడించి మానవసమాజానికి మహోపకారంచేసిన యూసఫ్ మెహరాలికి అంకితం చేస్తున్నాను.

శలవు. జనార్దనరావు.

# I

అది ఒక వెన్నెలరాత్రి: చంద్రుడు తన శీతలామృత కిరణాలను విరజిమ్ముతున్నాడు. అంత చక్కగా, చల్లగా ప్రకాశిస్తున్న చంద్రునిలో ఒక మచ్చ వుంది. ఆచక్కని చంద్రునికి మచ్చ యెందుకుండాలని? ఆమచ్చ ఒకవిధమైన నీడని, జింకని, కుందేలని ఆధునికులు, పూర్వులు అనేక విధాలు అనుకుంటూ వుంటారు. నేనలా అనను. చంద్రుడు ప్రకాశించే రాత్రి యెంత పేదవాడికైనా, యెంత క్షుధాపీడితుడికైనా, యెంత రుజాబాధితుడికైనా తప్తదుఃఖోపశమనం కలుగుతుంది. అంటే ఆవిషాదాన్ని చంద్రుని కిరణాలద్వారా తనలోకిలాక్కున్న మూలాన్ని ఆమచ్చ యేర్పడిందనుకుంటాను. ఏది ఎలాగయితేనేమిటి ఆనాడు ఒక పూలవనంలో ఒక అన్నచెల్లెలు లీలావతి, ముకుందములు చెరొక కుర్చీలోను కూర్చున్నారు.

లీలావతి: అన్నయ్యా! వెన్నెలెంత చక్కగా వుందో! గాలెంత హాయిగా వీస్తుంది. ఆహా! ఆచంద్రుణ్ణి చూస్తూ...

ముకుందరావు: అవును చెల్లాయి నిజమే. (అన్నాడు అన్యాయత్త చిత్తముతో) ఏది నాబ్రేస్లెటు యెక్కడుంది?

లీ– ఏమో నాకు తెలియదే, చూస్తానుండు (అతి ఆత్రంగా లేచి వెళ్ళింది) ఎక్కడా దొరకలేదు. లేదన్నయ్యా ఎక్కడ కన్పించలేదు.

శక్తులూ పుడుతూవుంటాయి. దానివల్ల సమాజానికి తీరని హాని కలుగుతుంది. అటువంటి పరిస్థితిరాకుండా కాపాడుకోటానికి కేవలం సాంఘిక సంస్కారంకోసం పాటుపడినంత మాత్రంచేత ప్రయోజనంలేదు. మున్ముందుగా ఆర్థిక పరిపుష్టిగల సమాజంగా మనం మానవసమాజాన్ని మార్చగలిగిననాడు సాంఘికంగానూ వైజ్ఞానికంగానూ మార్పులు సాధించడం సులభం. సమాజాన్ని ఆర్థికపరిపుష్టంగా మార్చడానికి విజ్ఞానం అవసరమేకాని వైజ్ఞానిక ప్రతిపత్తిగల సమాజాన్ని సృష్టించడానికి ఆర్థికంగా అందరికీ సమానావకాశాలు అన్నిరంగాలలోనూ వుండడం అవసరం. ఇంతటి ఘనమైన శాశ్వత ప్రభుత్వం వహించిననాడుగాని సమాజాన్ని చక్కబరచడం సాధ్యంకాదు. ఏమంటే ప్రభుత్వం పెద్దపెట్టున దేశంలోజరిగే ప్రతీమార్పుకీ (మంచికీ చెడ్డకూ) బాధ్యత గలిగివుంటుంది. ప్రభుత్వం అట్లాంటి అభ్యుదయకరమైన మార్పు తీసుకురాలేకపోతే దేశంలో అరాచకం ప్రబలుతుంది. అరాచకప్రాబల్యాన్ని నిర్మూలించడానికి రాజకీయ పక్షా లుద్భవిస్తూవుంటాయి.

ఎన్నుకున్నా మానవుని గుణాలను, అలవాట్లను తీర్చి దిద్దేది సంఘం, పరిసరాలు, వాతావరణం. వాతావరణానుగుణ్యంగా మానవుడు పరిణామం పొందుతూవుంటాడు. వాతావరణాన్ని సృష్టించేది ప్రభుత్వం కాబట్టి ప్రభుత్వం దేశంలో దారిద్ర్యం తలెత్తకుండాచూడాలి. అంటే కొద్దిమంది అధికధనసంపన్నులుగా, దోపిడిగాండ్రగా మారకుండా చూడాలి. సమాజసంపదను ఉత్పత్తి చేసేశ్రామికుల మధ్య సంపద్విభాగం సక్రమంగా (Ration) జరిగేటట్టు చూడాలి.

సమాజంలో పరులకష్టంమీద విపరీతలాభాలను పొందే తర గతిని రద్దుచేసి పెట్టుబడులను ప్రభుత్వపరంచేసి సాముదాయక కృషితో సమాజాన్ని ఉన్నత పథాలలోకి పురోగమింపజెయ్యాలి.

ఆర్థికపీడతో ఆకలితో బాధపడేదేశంలో మానవులు పరస్పరం కలహించుకొంటూ సాముదాయిక కృషిచేసి సృష్టిరహస్యాలను తెలుసుకుని ఉత్పత్తినిఅధికంచేసుకోడానికి విముఖులుగావుంటారు దానివల్ల అనేకనష్టాలు కష్టాలు కలుగుతాయి.

1906 వ సంవత్సరములో ట్రాట్స్కీ (Trotsky) జారిస్టుకోటలో తిరుగుబాటు నేరానికి విచారింపబడుతూ చెప్పినమాటలు గమనార్హంగా వున్నాయి. 'What we have is not a national Power but an automation of mass murder.' అప్పటికి ఆ దేశంలోవున్న ప్రభుత్వం జాతీయశక్తిగాను సమాజపురోగామిగాను లేకపోగా దరిద్రజనసామాన్యాన్ని నిర్దాక్షిణ్యంగా హింసించే యత్నంగా వున్నదని రష్యా ముఖ్యవిప్లవనాయకుడు ట్రాట్స్కీ చెప్పాడు. దరిద్రంతో క్రుంగిపోయేజనాన్ని ప్రభుత్వాలిచ్చగొడితే నిర్లక్ష్యంచేస్తే విపరీతగుణాలు పుడతాయని చరిత్ర రుజువుచేస్తోంది.

అందుచేత దారిద్ర్యనివృత్తికలిగి పురోగామిగావున్న దేశంలో ప్రజలు మంచి శక్తికలవార్లై అనేక సాధనాలు కనుగొని ఉత్పత్తిని అధికతరంచేసి సమాజాన్ని కాపాడగలుగుతారు. కాని వారికృషి ఫలితం వారికే లభిస్తుందనే నమ్మకం మాత్రం వుండాలి. అది ప్రభుత్వం కలిగించాలి. ప్రతీప్రభుత్వం ప్రతిపక్షానికి విమర్శకు తావివ్వాలి సమాజ

ము:— ఓహో.. అప్పుడు అక్కడ మరిచిపోయినట్లున్నాను (అని జ్ఞాపకం తెచ్చుకొని లేచి వెళ్ళిపోబోతున్నాడు అతని చెల్లి వెనుక వెళ్ళి అన్నయ్యా, అన్నయ్యా అని పిలిచింది)

లీ:— అన్నయ్యా, యీవాళ నాన్నగారు లేరు. ఇంటిదగ్గర పండుకోరాదూ.?

ము:— ఏమి, మీరు పండుకోలేరా. భయమా?

లీ:— భయము కాదన్నయ్యా, ఏం యీవాళ ఇంటిదగ్గర పండుకోరాదు.

ము:— నాకు కొంచెము పనుందమ్మా.

లీ:— సరేలే, వెళ్ళు, ఏదో సరదాగా కథలు కబుర్లు చెబుతావని ఉండమన్నాను. నీ వెప్పుడైనా యింటిదగ్గర పండుకొన్నావు గనకనా?

ము:— సరేలే అమ్మా, నీమాటప్రకారం యింటిదగ్గర పండుకొంటాను.

తనమాటకు వప్పుకున్నాడుగదా అని సంతోషించింది లీల. ఏమంటే, ముకుందము, అలా యేవిషయంలోను, ఒకరు చెబితే వినేరకం కాదసలు. మహా పెంకితనము, తలబిరుసుతనము. కాని చెల్లిఅంటే పంచప్రాణాలు, నిజానికి వాళ్ళిద్దరు ఒకతల్లి కడుపున పుట్టినవారుకారు. ఒక బంధువుల పిల్లను, మాతాపితృవిహీనను, ముకుందము తలిదండ్రులు, ఆడపిల్లలు లేనందున తీసుకొచ్చి ఆదరించేరు. అంటే పెంచుకొన్నట్టే లెక్క. లీలకు మాతృభాషా జ్ఞానం

బాగా నేర్చుంది కొంచెము, కొంచెము ఇంగ్లీషుకూడావచ్చును. చక్కగా వుంటుంది. ఎంత తిక్క, గీరా వున్నవాఁడైనా చెల్లెలంటే ప్రాణము ముకుందానికి. అన్నయ్య చాల తెలిసినవాడని, అభిమానము గలవాడని లీలకు తెలుసు. ఆతను మంచి వాగ్వాదము చేయగలడు. చాల దురలవాట్లున్నప్పటికి హృదయనైర్మల్యానికతనిదే మొట్టమొదటిపేరు. ఆసోదరీసోదరు లిద్దరు పూలతోటలో చెరొక కుర్చీలోను కూర్చున్నారు.

ము:— చెల్లాయి, అయితే నాన్నగారేవూరు వెళ్ళారు?

లీ:— ఏదో. పెళ్ళికెళ్ళారు, రేపు వచ్చేస్తారు.

ము:— నువ్వన్నం తిన్నావా?

లీ:— తిన్నాను. అన్నయ్యా నీవురోజూ ఎక్కడ పండుకుంటావు? మొన్న అమ్మనడిగితే నాకు దెలియదని చెప్పింది. నాకు చెప్పవా?

ము:— దాంట్లో యేముందమ్మా, ఒకస్నేహితు నింటిదగ్గర పండుకుంటాను. అంటే వేరేగా గది వుంటుందిలే. ఏం, ఎందుకడిగేవు?

లీ:— ఆఁ అబద్ధము చెబుతున్నావుపోనీలే. నాదగ్గర అబద్ధము.

ము:— నిజమేనమ్మా యిందులో అబద్ధమేముంది.

లీ:— కాదు.

ము:— కాదు, కాదట. కాకపోతే యేమిటి?

లీ:— ఏమిటా? ఏంపిటోలే (అని నవ్వింది)

ము:— సరేగాని, ఇక్కడ నిద్రపట్టదు గాలి లేదేం?

లీ:— నిద్రపట్టకపోతే, ఏదైనా చెప్పన్నయ్యా వింటాను

ము:— ఏమిటి చెప్పమంటావు, ఏంగావాలి?

లీ:— ఏదైన నీవు వ్రాసినకథ

ము:— ఆబీసువాల్లో, ఒక కథవుంది, అది తీసి చదువుకో పోయావు?

లీ:— అదా! అప్పుడు, మొన్న పత్రికత్తోంచేసాను, చదువు దామని, వ్రాత తెలియలేదు. అదేదో చెప్పరాదు? చెపుతు వింటాను.

ము:— ఏం చెప్పను, అది వక ప్రేమను తెలియజేసే కథ. ప్రేమనుగూర్చి కొంత వివరంగానే వ్రాసేను అందులో బాగా వ్రాయిస్తానంటే చదువుకున్నగాని

లీ:— ప్రేమ. అందరు అంటారు ఆముకర్త. ప్రేమంటే ఏమి టన్నయ్యా?

ము:— నీవు చెప్పు చూదాము

లీ:— ఏమో నాకు తెలియదు బాబు

ము:— పోని నీవెవర్ని ప్రేమిస్తున్నావో, చెప్పు

లీ:— ప్రేమంటే ఏమిటో తెలియనప్పుడు ఎవర్ని ప్రేమిస్తు న్నానో యెల్లా చెప్పగలను?

ము:— ఆకథలో వుంటుంది ప్రేమంటే యేమిటో.

లీ:— కథలో ప్రేమకు, ప్రత్యక్షంగా ప్రపంచంలో వున్న ప్రేమకు తేడా లేదా?

ము.— శేష్! అది కథగాదు, ప్రత్యక్షంగా జరిగిన విషయా నికి కథారూపం యిచ్చేము. చదవాలేదు, చెప్పా లేను వాదిసావేంవిటి?

శీ:— చెప్పన్నయ్యా అదేమిటో వింటాను. చెప్పు, చెప్పవ్.

ము:— నువ్వేదైన కథ చెప్పు వింటాను, ఆతరువాత ఆకథ చెబుతాను

శీ:— ఆఁ, సూర్యాస్తమయాలు తెలియకుండా, చదువులో నిమగ్నుడవయ్యే నీకు నేను చెప్పాలా? పిల్లకు గుర్రప్పు నడక నేర్పినట్టుంటుంది త్వరగా మొదలుపెట్టన్నయ్యా.

ము: అయితే విను, ఒకవూళ్ళో ఒక అబ్బాయి వుంటూ వుండేవాడు. సుహృదయుడు. కాని, ముక్కోపి. విసుపెక్కిన మహావిలాస పురుషుడు. ఇరవై యేళ్ళుంటాయి, చక్కని కవిత్వము చెపుతాడు. విశేషంగా చదువుకున్నవాడు. అణువణువు దేశాభిమానమే అతనికి. అతనికి అన్ని సద్గుణాలువున్నాయి, అన్ని దురలవాట్లు ఉన్నాయి. అతడొక విచిత్రమైన మనిషి, సృష్టిలో.

శీ. అదేమిటి, అన్ని సద్గుణాలు, అన్ని దురలవాట్లు వున్నాయి? బాగుంది. అతనిపేరు?

ము: పేరెందుకు?

శీ: పేరులేకుండా యెలా అన్నయ్యా?

ము: గొప్పచిక్కే, అతడు కొంతవరకు కాలేజీలో చదువు వెలగబెట్టి స్వస్తి చెప్పేడు. ఊరికే తిని తిరుగుతుంటాడు. మంచిమంచి పుస్తకాలు చదివి, ఆధునిక విషయాలు తెలుసుకొని పెద్దపెద్దవాళ్ళతో తర్కిస్తూ వాదప్రతివాదాలుచేస్తుంటాడు. కవని చెప్పేను

గదూ, అతను వ్రాసే పద్యాలు, కథలూ నూతన ఫక్కీలో హృదయాహ్లాదకరంగా వుంటాయి. ఇంగ్లీషులో గొప్ప Expert కాని వున్నదేమిటీ అంటే తల్లిదండ్రుల కతనంటే అయిష్టం.

[illegible]: అంత గొప్పవాడని చెప్తేవు, తలిదండ్రులకతనంటే ఎందుకు కిట్టదు?

ము: ఏమో? అడిగితే నేనేం జెప్పను? అతనంటే వాళ్ళకు కిట్టదు, వాళ్ళంటే అతనికి కిట్టదు, మొదట చెప్పేను కదు, అతడసలు స్వతంత్రుడైన మనిషి. ఒకరు చెప్పినట్టు వినడని, అదిగాక పోయినా, యీరోజుల్లో పెద్దవాళ్ళకు, పిల్లలకు పడుతుందేమిటి అసలు?

[illegible]: అలా అంటావు. అన్న న్యాయమే, పుత్రుడు పితాజ్ఞా వ్యతిరేకంగా ప్రవర్తించడము సబబా? అలాచేస్తే కృతఘ్నుడనిపించుకోడా?

ము: కాదు, కాదు చెల్లాయి. పితాజ్ఞ లేదు, వ్యతిరేకము లేదు. ప్రతిమానవుడికి యుక్తవయస్సు వచ్చేకా హృదయస్వాతంత్ర్యముండాలి. ప్రవర్తనగూడా తదనుగుణ్యంగా వుండాలి కాని, కేవలం, పరప్రేరితంగా వుండకూడదు.

[illegible]: నువ్వుకూడా అలా మాట్లాడుతావేమిటి, పెద్దల మాట వినకూడదూ? వింటే తప్పా? నీతీ నియామకం లేదన్న మాట.

ము: ఒత్తిరి లేకుండా మాట్లాడకు. చూడు, తండ్రి కొడుకుని డబ్బు సంపాదించమంటాడు. దానికోసం

గానేదో ఒక ఉద్యోగంచేసి, ఏలంచాలు పుచ్చుకో వడమో అలవాటు చేసికోవాలి. ఏవిధంగాను ధనార్జన చెయ్యడమూ, తద్వారా ధర్మసాధనం చేయడముకూడా శాస్త్రసమ్మతము. అది కొడుక్కి ష్టముండదు. వాడువరిజాసేవజేసి స్వల్పకాలమైనా నైతికంగా జీవించి చచ్చిపోవడం నీతంటాడు. అప్పుడు పరస్పర వైర మేర్పడుతుంది. ఎవరిదారివారు త్రొ క్కుతారు ఏమంటావ్?

లీ: ఆఁ, తండ్రి అలా తప్పుకని చేయమంటాడా యెక్క డైనా!

ము: మరేంజేస్తున్నాగా, ప్రపంచంల్లో, తండ్రిమాట ధర్మా ధర్మ విచారణలేకుండా పాటించడము ధర్మమం టావు. కొడుకు మనోభిప్రాయాలు తెలుసుకొని, తత్ప్రకారము తనబుద్ధి మార్చుకోడానికి లేశమైనా ప్రయత్నంచేయడు, ఇరుపక్షాలు ఆలోచించి ధర్మ పక్షం అవలంబించడము అరుదు. తండ్రి మూర్ఖ పట్టుపట్టి పోషిస్తున్నానుగదాయని, అధికారగర్వంతో ఆజ్ఞాపిస్తాడు. ఆత్మగౌరవముగలకొడుకు, అది సంతృ ప్తికరంగా లేనప్పుడు తృణీకరిస్తాడు.

లీ: నీవు చెప్పింది శాస్త్రవిరుద్ధం.

ము: శాస్త్రవిరుద్ధమా, ప్రహ్లాదుడేమి చేశాడు? తన మనో నిశ్చితమైన ధర్మంకోసం తండ్రిని తిరస్కరించి ప్రా ణాన్ని త్యజించడానికి సిద్ధపడ్డాడు. అది, అందులో

గదూ, అతను వ్రాసే పద్యాలు, కథలూ నూతన ఫక్కీలో హృదయాహ్లాదకరంగా వుంటాయి. ఇంగ్లీషులో గొప్ప Expert కాని వున్న దేమిటీఅంటే తల్లిదండ్రుల కతనంటే అయిష్టం.

శీ: అంత గొప్పవాడని చెప్పేవు, తలిదండ్రులకతనంటే నెందుకు కిట్టదు?

ము: ఏమనే అడిగితే నేనేంజెప్పను? అతనంటే వాళ్ళకు కిట్టదు, వాళ్ళంటే అతనికీ కిట్టదు, మొదటె చెప్పేను కదు, అతడసలు అడ్డసుడి మనిషి. ఒకరు చెప్పినట్లు వినడసి, అదిగాకపోయినా, యీరోజుల్లో పెద్దవాళ్ళను పిల్లలకు పడుతుందేమిటి అసలు?

శీ: అలా అంటావు. అన్యాయ్యమది, పుత్రుడు పితాజ్ఞా వ్యతిరేకంగా ప్రవర్తించడము సబబా? అలాచేస్తే గర్భాద్ధుడనిపించుకోఁ

ము: కాదు, కాదు చెల్లాయి. పితాజ్ఞ లేదు, వ్యతిరేకము లేదు. పరిణమానవుడికి యుక్తవయస్సు వచ్చేకా హృదయస్వాతంత్ర్యముండాలి. ప్రవర్తనకూడా తదనుగుణ్యంగా వుండాలికాదా. కేవలం, పరప్రేరితంగా వుండకూడదు.

శీ: నువ్వుకూడా అలా మాట్లాడుతావేమిటి, పెద్దల మాట వినకూడదూ? వింటే తప్పా? నీతీ నియామకం లేదన్నమాట.

ము: బుద్ధిలేకుండా మాట్లాడకు. చూడు, తండ్రి కొడుకుని డబ్బు సంపాదించమంటాడు. దానికోసం

ఏదో ఒక ఉద్యోగం చేసి, ఏలంచాలు పుచ్చుకోవడమో అలవాటు చేసికోవాలి. ఏవిధంగాను ధనార్జన చెయ్యడమూ, తద్వారా ధర్మసాధనం చేయడముకూడా శాస్త్రసమ్మతము. అది కొడుక్కిష్టముండదు. వాడుపరీజా సేవ జేసి స్వల్పకాలమైనా నైతికంగా జీవించి చచ్చిపోవడం నీతంటాడు. అప్పుడు పరస్పర వైర మేర్పడుతుంది. ఎవరిదారివారు త్రొక్కుతారు ఏమంటావ్?

లీ: ఆం, తండ్రి అలా తప్పుకని చేయమంటాడా యెక్కడైనా!

ము: మరేం జేస్తున్నాగా, ప్రపంచంలో, తండ్రిమాట ధర్మాధర్మ విచారణలేకుండా పాటించడము ధర్మమంటావు. కొడుకు మనోభిప్రాయాలు తెలుసుకొని, తత్ప్రకారము తనబుద్ధి మార్చుకోడానికి లేశమైనా ప్రయత్నం చేయడు, ఇరుపక్షాలు ఆలోచించి ధర్మపక్షం అవలంబించడము అరుదు. తండ్రి మూర్ఖపట్టుపట్టి పోషిస్తున్నానుగదాయని, అధికారగర్వంతో ఆజ్ఞాపిస్తాడు. ఆత్మగౌరవముగలకొడుకు, అది సంతృప్తికరంగా లేనప్పుడు తృణీకరిస్తాడు.

లీ: నీవు చెప్పింది శాస్త్రవిరుద్ధం.

ము: శాస్త్రవిరుద్ధమా, ప్రహ్లాదు డేమి చేశాడు? తన మనోనిశ్చితమైన ధర్మంకోసం తండ్రిని తిరస్కరించి ప్రాణాన్ని త్యజించడానికి సిద్ధపడ్డాడు. అది, అందులో

తీసికోవలసిననీతి.

లీ: అయితే మరి భీష్ముడేంచేశేడు? తండ్రి సుఖంకోసము వివాహవిహీనుడై రాజ్యభ్రష్టుడై త్యాగాన్ని చూపించలేదా?

ము: మంచి Point చెప్పావు. నవయవ్వనంలో ఉన్న కొడుక్కి పెళ్ళి లేకుండాచేసి యేదో వక యవ్వనంలోవున్న పిల్లపై మమకారంచేత, జ్యేష్ఠపుత్రునకు రాజ్యార్హత లేకుండా చేయడములో ఆతండ్రిచూపించిన అమానుష్యమైన స్వార్థము ఎంతహేయమో చూడు. అటువంటి దుర్మార్గుని కాంక్షకారణమైన భీష్ముని త్యాగాన్ని, వెఱ్ఱిబాగులతనమంటారు. నువ్వాలోచించు, అందులో తండ్రి క్రౌర్యము, స్వార్థము, స్త్రీలోలత గోచరిస్తున్నాయా లేదా?

లీ: నిజమే అన్నయ్యా, అదిచాల తప్పు తనసుఖంకోసం కొడుకుని యావజ్జీవం సన్యాసిగా చేశాడు.

ము: ఊఁ అలాదారిలోకిరా.

లీ: సరే, తరువాత చెప్పు. అతనికీ, తలిదండ్రులకూపడదు,

ము: అతని మాతాపితలు అతన్ని మార్గంలోకి తీసుకురావడానికి, అతని మనస్సు మార్చడానికి, విశ్వప్రయత్నాలు చేసి విఫలులయ్యారు. ఇక నిరాశ చేసుకొని వూరుకొన్నారు. ఆవూళ్ళోనే వాళ్ళింటికి దగ్గరలో ఒక Sub Majestrate గారు కాపురమున్నారు. వారికొక్కతే అమ్మాయి, ఆ అమ్మాయికి 16--17 యేళ్ళుంటాయి. మంచి అవయవసౌష్ఠవం కలిగినపిల్ల.

నవనాగరికతల కలవాటుపడిన దవ్వుటచేత చాల fashionable గా అలంకరించుకొంటుంది V Form దాకా చదువుకొంది. మంచి సంగీతముకూడావచ్చు. పొడవు, కుట్టుచ కాకుండా మంచిరంగులో విశాల నేత్రాలతో ఉన్న ఆ అమ్మాయి ముఖం చూడ్డానికి అందరకూ ఆహ్లాదకరంగా నే వుంటుంది. చదువంటే యెక్కువ అభిలాష. ఎప్పుడూ యేదో చదువుతూనే వుంటుంది

లీ: ఆ అమ్మాయి పేరు?

ము: పేర్లడుగుతావేంవిటి?

లీ: పేరు లేకపోతే యెట్లా?

ము: ఆ అమ్మాయి పేరు రాధ. కాని అందరూ గారాబంగా అమ్మడూ అని పిలుస్తారు.

లీ: ఊఁ, సరే, ఏమయింది? ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదా?

ము: కాలేదు. ఒకనాడు ఆ అమ్మాయి మన ప్రభాకరం వ్రాసిన ఖండకావ్యము తీసి సాంతంగా చదివింది. చదివి, అతనిలో యేదో వక గొప్పతనము లేక పోతే యింత చక్కగా వ్రాయగలడా అనుకొంది. అతన్ని తరుచు చూస్తూనేవున్నా యిప్పుడతనిమీద ఒకవిధమైన గౌరవభావం ఏర్పడింది రాధకు హృదయంలో. కాని ఏంలాభం.

లీ: ఏం? ఎందుచేత?

ము: వాళ్ళింట్లో అతన్నిగురించి చెడ్డగా చెప్పుకుంటూం టారు. వాళ్ళకీవాళ్ళకీ స్నేహముచేత, అందుకు రాధ పవిత్రమనోభావం ఉపసంహరింపబడుతూ వుంటుంది.

లీ: ఏమని చెప్పుకుంటూ వుంటారేమిటి?

ము: అతడు మంచివాడు కాడని, దుర్మార్గుడని చెప్పుకుం టూ వుంటారులే.

లీ: మంచివాడుకాడా?

ము: కాడా అంటే యెవరు చెప్పగలరు. ఇర్వై గంటల్లో యో లేవో తాగుతాడు, నిరర్థకంగా తిరుగుతాడు. నీరసంగా అనారోగ్యంగా బాధపడుతుంటాడు.

లీ: అయితే వాళ్ళు చెప్పుకోవడములో తప్పేముంది?

ము: తప్పే. ఎలాతిరిగినా, తనసుఖాన్ని తను కోల్పోతున్నాడు తప్ప, యెదుటి హృదయానికి బాధ కల్గించడము లేదు. అలాంటి మనిషికాదు. హృదయ నైర్మల్యా చూడాలిగాని అలవాట్లకేమిటి? అయితే కాఫీ త్రాగ డము దురలవాటే, సిగరెట్టు కాల్చడము దురల వాటే.

లీ: అలా అని సారా త్రాగి రిజాలాగా తిరుగుతారా?

ము: అలాఅంటే అందులోమాత్రం తప్పేముందీ అంటాడు. దానివల్ల యెవరికి నష్టంకల్గింది అది స్వేచ్ఛఅంటాడు.

మరీ విపరీతంగా త్రాగి రోడ్లమీదపడి దొర్లడులే. వ్యభిచారమంటావా అది కొంచెము హెచ్చే

లీ: తెనువాత రోగమయింది?

ము: ఒకనాడా అమ్మాయి ప్రభాకరం వ్రాసిన పుస్తకం తీసి మురిసిపోతూ కూర్చుంది మేడమీద. వాళ్ళమ్మ 'భోజనానికి లేవవే అమ్మాడూ చాల ప్రొద్దుపోయింది, లే, ఏంవిటా పుస్తకంలో వున్నది.

లీ: అబ్బే ఏమీలేదు వాళ్ల ప్రభాకరం వ్రాసినపుస్తకం అంది రాధ. ప్రభాకరం పుస్తకాలుకూడా రాస్తాడా, చాలులే అంది రాధతల్లి. ఆ దేవిటమ్మా చాల చక్కగా రాస్తాడు. తెలివైనవాడు అని రాధ చెపితే వాళ్ళమ్మ విసుగా 'తెలివి' తెలివిలేకేమి లోటు, దుర్మార్గులకే తెలివితేటలుంటాయి అంది. ఏం దుర్మార్గుడమ్మా అని రాధ ప్రశ్నించగా అన్ని సద్గుణాలున్నాయి అబ్బాయికి, వాడిగోడవ మనకెందుకులే భోజనానికి అని తొందరజేసింది రాధ తల్లి. రాధ లేచి భోజనానికి వెళ్ళిపోయింది. అని కథ చెప్పుతూ ముకుందము 'చెల్లాయి' చాల టైమయినట్లుంది అన్నాడు. ఎంతో టైము కాలేదన్నయ్యా! పన్నెండవుతుంది. అని లీల చెప్పగా ముకుందము 'నారిష్టెక్కడ పెట్టాను' అనగా లీలావతి దబ్బున లేచి తనరిష్టు తీసుకొచ్చి లైటుదగ్గర పన్నెం

ను మూ పైన అయింది అన్నయ్యా అని అతని చేతికి పెట్టబోయింది. వద్దమ్మా నీ చేతికి పెట్టుకో అన్నాడు ముకుందము. లీల తన చేతికి గడియారము పెట్టుకొని ఎలావుందన్నయ్యా నాచేతికి ?

ము: చాల బాగుంది.

లీ: అయితే నాకిచ్చేస్తావా మరి.

ము: ఆఁ ఎంతాశ?

లీ: పోనిలే (అని చనువు నటించింది)

ము: పోనీ తీసుకో, నీకెందుకు?

లీ: ఊరికే అన్నాను, ఏమంటావో అని, నాకెందుకు నీకుండాలికాని

ము: నిదర పట్టడం లేదా?

లీ: లేదు. కథ చెప్పు.

ము: నాకు నిదరవస్తుంది ఏమీ లేదా తినడానికి, కొంచెము "టీ" వున్న బాగుండును.

లీ: టీ పెడతానుండు అన్నయ్యా అని లోనికెళ్ళి ఇనుప పొయ్యి తెచ్చి, నీళ్ళు పెట్టి, నీళ్ళు మసుగుతున్నాయి కథ చెప్పు మరి.

ము: తాగినతరువాత చెప్పకో కూడదా?

లీ: ఏం ఇప్పుడు చెప్పడానికేం?

అంతట ముకుందము ప్రపంచంలో అంతఆదరంతో చూసి కావలసినవి సంతోషంతో చేసూనున్నూ, వివిధమైన

లీ: చెప్పన్నయ్యా కథ.

ము- (సిగరెట్టు ముట్టించి) కొంచెము Rest ఇయ్యమ్మా చెపుతాను.

లీ: అన్నయ్యా ప్రభాకరాన్ని ఆ అమ్మాయి ప్రేమిస్తుందా?

ము: ఏం?

లీ: అలా తోచింది నాకు

ము: ప్రభాకరం చాలమంచివాడు; పెంకివాడు; దురలవాట్లు గలవాడు, కొంచెము అపసవ్యపు మనిషి. ధనార్జనావిధము తెలియదు

లీ: అయితే స్త్రీ హృదయానికి ధనం కావాలా? అతనిలో యేదో సాధారణ మానవాతీతమైన ఔన్నత్యముం దన్నావు కాదూ, అయితే అతను కవి; మంచి పుస్తకాలు రాస్తాడన్నావు దానివల్ల డబ్బు రాదూ?

ము: పుస్తకాలవల్ల డబ్బెంతొస్తుంది? ఎప్పుడూ రాదు. కేవలమానవ సంతృప్తికోసం వ్రాసిన పుస్తకాలకయితే డబ్బు వస్తుందికాని యదార్థంకోసం నిలబడి ప్రకృతి సహజంగా వ్రాసిన కలానికి సిరాకైనా డబ్బురాదు, ప్రజామోదమూ ఉండదు. నాకెంత డబ్బొచ్చిందో ప్రభాకరానికి అంతే డబ్బు వచ్చింది.

లీ: సరేయీ మాటు చెప్పు సిగరెట్టు అయిపోయిందికదూ.

ము: ఉఁ. అమ్మడు కుటుంబానికి ప్రభాకరం కుటుంబానికి

స్నేహం ఉంది. అందుచేత వాళ్ళ విషయాలు వీళ్ళు వీళ్ళ విషయాలు వాళ్ళు పరోక్షాన్ని విమర్శించుకొంటారు. ఆలా విమర్శించడములో, అమ్మడు యింట్లో అంతా పరిభ్ర[illegible]రాన్ని ఆడి పోసుకొనేవాళ్లే.

లీ: అవును, అమ్మడూనా?

ము: కాదు, ఆ అమ్మాయికతనంటే మక్కువ యిష్టము.

లీ: అతనికో?

ము: అతనికా అమ్మాయి వుందని తెలియునే తెలియదు.

లీ: ఏం?

ము: సిగ్గు తక్కువ మనిషి. భోజనానికి మాత్రం యింటికి వచ్చి పోతూవుంటాడు. కన్పిస్తే చూస్తూ వుంటాడా అమ్మాయిని ఆ అమ్మాయేమిటి, ఏ అమ్మాయి కన్పించినా చూస్తాడు. కాని ప్రత్యేకతేమీ లేదు యింకా.

లీ: సరే తరువాత ఏం జరిగింది?

ము: ఏం జరిగింది, ఆ అమ్మాయి మాత్రం దృష్టంతా అతని మీదనే పెట్టుకొని అతని సహవాసంకోసం ఉబలాట పడుతోంది. ఏం లాభం, స్త్రీ—ఇది హిందూ దేశం, ఇక్కడ స్త్రీల మనోభావాలు వెలిబుచ్చి వరాన్వేషణా స్వాతంత్ర్యం పొందడానికి వీలులేదు.

లీ: ఇతర దేశాల్లోనో?

ము: ఇతర దేశాల్లో స్త్రీలు స్వతంత్రులు, నిన్న నేను

ప్రేమించేను, నన్ను పెళ్ళాడతావా అని అడుగు తారు ఇక్కడ పురుషులే చెయ్యాలేరావని.

లీ: అంతసులువుగా తేలిపోతుందా అన్నయ్యా, స్త్రీ యే దేశంలోనైనా, స్వాభిప్రాయాన్ని విప్పి చెప్పగలదా?

ము: ఓ, దర్జాగా చెబుతుంది. మన దేశంలోలా కాష్టాలేరు కాని, నా నా వెకిలిచేష్టలు చేసి చెప్పుదెబ్బలు తింటూవుంటారు, క్రియాప్రాప్తి లేకుండా, ఏ పురుషుడైనా అలా తెగించి చెబితే వాణ్ణలరిపెట్టి పదిమంది లోకి పిలుస్తారు పిచ్చి వెధవలు ఇష్టముంటే వుంటుంది లేకపోతే పోతుంది, అడిగి తెలుసుకోపోతే ఎట్లా.? తరువాత ఒకనాడు మాధ్యాహ్నం, ఆ వేళ శెలవు గాబోలు మేజస్ట్రేటుగారు ఇంటిదగ్గరున్నారు. ఆ దారిని పోతున్న పరిభాకరాన్ని, "పరిభాకరం"—పరిభాకరం; అని పిలిచేరు అధికారంతీవితో ఏంవండీ అని వెళ్ళేడు పరిభాకరం.ఏదైన ఉద్యోగం చేస్తున్నావా లేదా అని అడిగేరు మేజస్ట్రేటు. అబ్బే ఏమీలేదండీ అని ఉద్యోగము తనకిష్టములేనట్టు చెప్పేరు నిర్లక్ష్యంగా. దానిమీద న్యాయాధికారి "ఏం ఏదైనా చూసుకోకూడదు యెందుకలా బలాదూర్‌జమానులాతిరుగుతావు" అన్నాడు మందలింపు స్వరంతో. ఉం, ఇందుకేనా పిలిచారు, ఏదో కోపంగా వెళ్ళిపోలేదు పరిభాకరం కూర్చోవోయ్, వెళ్ళిపోవడమేమిటి.

అంత తొందఱ. ఉద్యోగాలు లేని రోజుల్లో స్నేహం చేస్తావులే, అన్నాడు సమయోచితంగా ప్రభుత్వోద్యోగి—అంతేలే చిల్లాయి పెద్దవాళ్ళ హృదయాలకు నాలుక్కీ సంబంధముండదు. సమయస్ఫూర్తిగా మాట్లాడుతారు. వాళ్ళనే గొప్పవాళ్లు, మంచివాళ్లు అంటారు లోకంలో.

లీ: ఎందుకు?

ము: ఏభై యేళ్ళున్నాయిగనుక.

లీ: ఏభైయేళ్ళుంటే మాత్రం మంచివాళ్లవుతారా, వయస్సుకీ మంచితనానికీ సంబంధమేమిటి?

ము: సంబంధమే ప్రజా సామాన్యమదే చూస్తుంది.

లీ: తరువాత యేమయింది. అతను వెళ్ళిపోయేడా?

ము: లేదు, కూర్చున్నాడు, ఏదో యిద్దరూ బాతాఖానీలోకి దిగేరు. మేజిస్ట్రేటుగారు, ఫలానో తాహసీల్దారని, R. D. O , అని, డిస్ట్రిక్టు కలక్టరని, Endorsemement అని, Promotion,—luck అని, వట్టి Revenue Departement గొడవలు మాట్లాడుతు తున్నాడు. ప్రభాకరం శ్రద్ధగా ఆలకించలేకపోతున్నాడు, అతన్ని తృప్తిపఱచడానికి ఆయన రాజకీయాలు తర్కించడము ప్రారంభించేడు, ఆ విషయం ఆయనకు అభ్యాసము లేని విద్య. ప్రభాకరాన్ని వుపాధ్యాయుడు, ఆయన విద్యార్థిలా మారిపోయేరు

ఆ విషయం మాట్లాడినంత సేపు. పరిభాకరం చెప్పె విషయాలు ఆయనకు కొత్త అయినా, అవన్నీ తనకి గిట్టే పూతున్నాడు తల. ముఖలక్షణాలు మాత్రం ఆయనకా విషయాలు తెలియవన్నట్టు చెపుతున్నాయి—చెల్లీ, వాళ్ళమ్మాయి రాధ యెక్కడుందనుకుంటున్నావు?

లీ: రాధా, ఏమో నాకేం తెలుసు, ఎక్కడో చదువుకుంటోందేమో!

ము: ఆఁ చదువుకుంటుందా, చదువుకుంటు కూర్చుంటే నా, వలచి ఆరాధిస్తున్న పరిభాకరం ఎక్కడవుపన్యసిస్తుంటే, చదువుకొంటుందా! నువు మరీ చెబుతావు, మాకు తెలియకపోతే మీ ఆడవాళ్ళ విషయాలు.

(అంటే లీల నవ్వింది)

లీ: ఏఁ ఆశ్రమక్కొచ్చి పొంచి అతని మాటలు వింటుందా!

ము: ఆఁ రైటు, సమంగా చెప్పావు, నువ్వు బాలమంచిదానవమ్మా, మా చెల్లాయి రాజా.

లీ: అల్లా పొగడకూడదు బాబు.,

ము: పొగడ్డం లేదు, నిజంగానే చెప్పాను. నవ్వకుండా (లీల దాంతో ఉప్పొంగిపోయింది.)

ముకుందుడగ్గర వృధా పొగడ్త లేదు, ఒక్క పట్లమెవర్నీ మెచ్చుకోడు. అటువంటివాడి మెప్పు పొందగలగడమే ఒకగొప్ప విషయం అని లీల అభిప్రాయం.

లీ: పొగడ్డం కాకపోతే యేమిటి. నేను నీతో మాట్లాడను లే అంది నవ్వుముఖంతో.

ము: చెల్లాయి, మీ స్త్రీ జాతిలో నేననేక రకాల మంది నెరుగుదును. నీవంటి సుగుణవతి నెక్కడా చూడ లేదు. నీకున్న ఓర్పు ఇంగితజ్ఞానము యెవ్వరికీ లేదు. ఎదుటిహృదయాన్ని అర్థం చేసుకుంటావు. పొగ డ్తదమ్మా మంచిదానవే నువ్వు.

లీ: ఏమిటన్నయ్యా మాట విప్పి చెప్పడానికి సామర్థ్యం లేనిదాన్ని, హిమాలయ శిఖరాని కెత్తుతావు. కొంత నీ దగ్గర నేర్చుకోవాలిగాని.

ము: అదెటూ నిజమే, అంతమాత్రాన్ని నీ హృదయాను రాగం, నైర్మల్యత ఎక్కడకు పోతాయి. ఒకద్దం చెల్లాయి నీ హృదయం.

లీ: నీవు కవివన్నయ్యా.

(తనకు తెలియని గొప్పతనాన్ని అన్నయ్య చెప్తున్నాడన్న సంతోషంతో)

అన్నయ్య చాల మంచివాడు, కాని అతన్ని గురించి వేరుగా చెప్పుకుంటారు. అమ్మకీ, నాన్నకీ కూడ యిష్టముండదు అన్నయ్యంటే. అతడు కవి, సర్వ స్వతంత్రుడు, తనకు ధర్మమని తోచినది సర్వ శాస్త్రవిరుద్ధమైనా చేసి తీరుతాడు.

తన యెదురుగుండా అన్యాయం జరుగుతూంటే

ఆ విషయం మాట్లాడినంతసేపు, ప్రభాకరం చెప్పే విషయాలు ఆయనకు కొత్తే అయినా, అవన్నీ తనకి గిట్టే వూపుతున్నాడు తల. ముఖలక్షణాలు మాత్రం ఆయనకా విషయాలు తెలియవన్నట్టే చెపుతున్నాయి— చెల్లీ, వాళ్ళమ్మాయి రాధ యెక్కడుందనుకుంటున్నావు?

లీ: రాధా, ఏమో నాకేం తెలుసు, ఎక్కడో చదువుకుంటోందేమో!

ము: ఆఁ చదువుకుంటుందా, చదువుకుంటూ కూర్చుంటుందా, వలచి ఆరాధిస్తున్న ప్రభాకరం ఎక్కడ ఉపన్యసిస్తుంటే, చదువుకుంటుందా? నువ్వు మరీ చెబుతావు, మాకు తెలియకపోతే మీ ఆడవాళ్ళ విషయాలు.

(అంటే లీల నవ్వింది)

లీ: ఏఁ అక్కడకొచ్చి పొంచి అతని మాటలు వింటున్నదా?

ము: ఊఁ రైటు, సమంగా చెప్పావు, నువ్వు బాలమంచిదానవమ్మా, మా చెల్లాయి రాజా.

లీ: అల్లా పొగడకూడదు బాబు.,

ము: పొగడ్డంలేదు, నిజంగానే చెప్పాను. నవ్వకుండా (లీల దాంతో ఉప్పొంగిపోయింది.)

ముకుందా దగ్గర వృధా పొగడ్త లేదు, ఒక పట్ల ఎవర్నీ మెచ్చుకోడు. అటువంటివాడి మెప్పు సంపాయించడమే ఒకగొప్పవిషయం అని లీల అభిప్రాయం.

లీ: పొగడ్డం కాకపోతే యేమిటి. నేను నీతో మాట్లాడనులే అంది నవ్వుముఖంతో.

ము: చెల్లాయి, మీ స్త్రీ జాతిలో నేననేక రకాల మందిని ఎరుగుదును. నీవంటి సుగుణవతి నెక్కడా చూడలేదు. నీకున్న ఓర్పు పరేంగితజ్ఞానము యెవరికీ లేదు. ఎదుటిహృదయాన్ని అర్థం చేసుకుంటావు. పొగడ్తేదన్నా మంచిదానవే నువ్వు.

లీ: ఏంవిటన్నయ్యా మాట విప్పి చెప్పడానికి సామర్థ్యంలేనిదాన్ని, హిమాలయ శిఖరాని కెత్తుతావు. కొంత నీ దగ్గర నేర్చుకోవాలిగాని.

ము: అదెటూ నిజమే, అంతమాత్రాన్ని నీ హృదయానురాగం, నైర్మల్యత యెక్కడకు పోతాయి. పరిశుద్ధం చెల్లాయి నీ హృదయం.

లీ: నీవు కవివన్నయ్యా.

(తనకు తెలియని గొప్పతనాన్ని అన్నయ్య చెప్పున్నాడన్న సంతోషంతో)

అన్నయ్య చాల మంచివాడు, కాని అతన్ని గురించి వేరుగా చెప్పుకుంటారు. అమ్మకీ, నాన్నకీ కూడ యిష్టముండదు అన్నయ్యంటే. అతడు కవి, సర్వ స్వతంత్రుడు, తనకు ధర్మమని తోచినది సర్వ శాస్త్రవిరుద్ధమైనా చేసి తీరుతాడు.

తన యెదురుగుండా అన్యాయం జరుగుతూంటే

ఇది యే గొడవైనా తనకు సంబంధములేక పోయినా కలగజేసుకొంటాడు. అవును గొప్పవాళ్ళ లక్షణ మంతే, దురలవాట్లున్నాయి. కోపం హెచ్చు. హార్య దుతీక్ష్ణంగా ప్రకాశిస్తాడు అయితేమాత్రం ఏవత్ సృష్టికీ కారణభూతు డతడే అని ఆలోచించుకొంటూంది లీల

ము: లీలా! నిద్రా పోనీ పందుకో మూడయింది.

లీ: వద్దన్నయ్యా, కథ చెప్పు.

ముకుందము కథ ప్రారంభించేడు. అంతలో మేజిస్ట్రేటుగారు వస్తానుందని యేదో పనిమీద లోపలికి వెళ్ళేరు ఆ హాల్లో అతనొక్కడే కూర్చున్నాడు. ఆ హాల్లోకి తెరువబడున్న ఒక గదిలో నువ్వున్నట్టు పొంచి వారి సంభాషణ వింటున్న రాధకది అదును యింది. దబ్బున తలుపు చాటునుంచి వచ్చి అతని వైపు తొంగి చూసింది. అతడు ఉక్కకు చొక్కాతో పైకి కిందికి విసురుకుంటున్నాడు.

రాధ ఒక విసనికర్ర తీసి అతనివైపు విసిరింది. ఆ విసినికర్ర వచ్చినవైపు చూచి అక్కడున్న యువ్వనవతి చేతిలో వున్న తను రాసిన పుస్తకం చూసేడు. ఇదివరకు చూసేడా అమ్మాయిని, కాని యీ మారు తనికొక నూతనభావం ఏర్పడింది ఆ దేంటో చెప్ప టానికి వీలులేదు.

ప్రి: మీ నాన్నగారేరి?
రా: వస్తారండి యిప్పుడే అలా వెళ్ళేరండి.
ప్రి: నన్నిక్కడ కూర్చోబెట్టి అలా వెళ్ళేరు? (అన్నాడు తొందర పని వున్నట్టు)
మంచివారే మీ నాన్నగారు.

అమ్మడు తన చంచలనేత్రాలని చిత్ర విచిత్రంగా కప్పిసరి పజేస్తోంది. అధైర్యంగా నవ్వుతూ. అతను చూడాలని, తన చేతిలోని పుస్తకం టైటిల్ కన్పించేటట్టు ముందుకు పెట్టింది.
ప్రి: ఏదేదీ, తెలుగా, ఇంగ్లీషా (అన్నాడు సగర్వంగా టైటిల్ చూడనట్టు)
రా: మీరు వ్రాసిన పుస్తకమేనండీ.
ప్రి: అర్థమయిందా నీకు సమంగా?
రా: ఏదోలెండి మీ లాంటి మహాకవులు వ్రాసిన పుస్తకాలు మా కేలా అర్థమవుతాయి!
ప్రి: అల్లాగా; (అన్నాడు నవ్వుతూ)
రా: మా స్నేహితులు కావాలన్నారు, వున్నాయా మీ దగ్గర, నాకో రెండు కాపీలు కావాలి, డబ్బివ్వమంటారా?
ప్రి: అక్కర్లేదు ముందెందుకు డబ్బు, వంపేక ఇవ్వొచ్చు.
రా: మరచిపోతారేమో?
ప్రి: భయంలేదు మరచిపోను.

రా: ఏమో లెండి, వస్తానండి, మా నాన్నగారు వస్తున్నట్టున్నారు.

(అని లోపలికి వెళ్ళింది)

చూశావా చెల్లాయి ఆ మాటలో ఎంత అర్థముందో.

లీ: ఏమర్థముంది?

ము: వాళ్ళ నాన్నగారుండగా ఆమె అతనితో మాట్లాడకూడదన్నమాట, వాళ్ళ నాన్నగారు లేనప్పుడే మాట్లాడుతుందా, ఏమంత రహస్యమెందుకు అంత చిన్న విషయానికి?

లీ: లేకపోతే ఆయన కోప్పడరు?

ము: కోప్పడతారా? ఏంకొంప మునిగిపోయిందని కోప్పడతారు, పోనీ అంత భయమున్నట్టయితే అతనితో మాట్లాడ్డమెందుకు?

లీ: అతనిమీద అపరిమితమైన అభిమానమని నువ్వేకదా చెప్పేవు.

ము: అవును దానిని ప్రత్యక్షంగానే తెలియపరచరాదు?

లీ: నిజమేకాని పురుషునితో ఎంత నిర్మలమైన ప్రేమున్న స్త్రీయైనా తన మనోభావాన్ని విప్పి చెప్పలేదు అందులోను అలాంటి సహాయమేదైన సంపాదించిన వ్వాడు కొంత సాహసం వహించి యేదో సూచనగా చెబుతుంది. నీకు రహస్యముండకూడదు జీవితంలో అది నీలాంటి పురుషుడికైతే కాని మా స్త్రీజాతికి సహజంకాదు.

ము: తెలివిక్షేటలుగానే మాట్లాడేవు. నువ్వు చెప్పినదంతా యథార్థము.

లీ: తరువాత?

ము: ప్రభాకరావు యింటికి పోయి మామూల్గానే వుంటున్నాను అమ్మడు యేదో మహాయుద్ధంగెలిచి నట్టు, అనుకోని మహదైశ్వర్యము తనకబ్బినట్టు సంతోషముతో కేరింతాలు కొడుతుంది. అవును— ప్రతి స్త్రీకి పురుష స్పృహాగంధమైన దినాలలో అల్లాగే వుంటుంది. వాళ్ళు కొంచెం విచారం సంభవిస్తే మిక్కిలి దుఃఖిస్తారు కొంచెం సంతోషం కలిగితే చాలు పట్టలేకపోతారు. అందులోను ప్రభాకరావు చాల గొప్పవాడని రాధ అభిప్రాయము. నాకు కూడ చాల యిష్టము అతనంటే. అతడు నిర్వికారపురుషుడు సుఖదుఃఖ దూరుడు; మంచిజ్ఞానము, చిన్నవయస్సైనా మంచి అనుభవంకలవాడు. జాలి హృదయము ఏదైనా అప్పటికప్పుడుమరచిపోతాడు. కోపం వచ్చిందంటే కొంప ముంచుతాడు. చూడు, రాధ యింత మురిసిపోతుందా అతనితో మాట్లాడి నందుకు అతడప్పుడే మరచిపోయేను.

లీ: ఎందుకు మరచిపోయేడు.

ము: అంతే, అతను రాధలాంటి ఎందరితోటో మాట్లాడు తాడు. నిత్యకళ్యాణం పచ్చతోరణం. కేవలం శ్రీకృ

ష్ణమూర్తి ఆ విషయంలో, అదిగో అప్పుడే కాకులు కూస్తున్నాయి, తెల్లవారిపోయింది.

లీ: అవును తెల్లవారిపోయింది. ఆఖరకు వాళ్ళిద్దరకు సఖ్యత యేర్పడుతుందా?

ము: రేపు చెపుతానులే. అని ఆ వేళకి కథ ఆపుచేశాడు.

ప్రజలంతా ముఖ్యంగా రైతులు అలవాటు ప్రకారం పొలాలలోకి వెళ్తున్నారు. చల్లని గాలి, సూర్యుని వేడితో మిళితం కాకుండా నిద్రనించి లేచిన ప్రజలకు ఉత్సాహమిస్తోంది. సూర్యుడు క్రమప్రకారం తన శ్వేత కిరణాలను లోకంలోకి ప్రసరింపజేసి, ముకుళిత హస్తాలతో తన్ని ప్రార్థించేవాళ్ళని ఆశీర్వదిస్తున్నాడు. పిల్లలు నానా అల్లరి చేస్తూ ప్రతియింటిలోను సందడి చేస్తున్నారు. స్త్రీలు గృహకృత్యాలలో నిమగ్నులై తొందరగా ఎవరి పనివారు నెరవేర్చుకొంటున్నారు.

# III

ముకుందారావు కింకా అన్నదమ్ములున్నారు. వాళ్ళంతా బాగుగా చదువుకొని ఉద్యోగాలు చేసుకొంటున్నారు. ఇతనికి ఉద్యోగార్హతకు తగిన చదువున్నప్పటికీ, ఉద్యోగమంటే యిష్టంలేదు; ఉద్యోగం లేకుండా, బాధ్యత లేకుండా. పాఠశాలలో చదువుకొనే రోజుల్లో ఏవి చేయకూడని పనులు ప్రజాసౌకర్యానికి వ్యతిరేకములు, అని అనుకొంటామో, ఉద్యోగము చేసేటప్పుడు అవన్నీ చేయవలసి వస్తుంది. మనస్సు లేకుండా ప్రతివానికి నమస్కరించవలసి వస్తుంది. చెడ్డ అని తెలిసినప్పటికి అధికారమునకు విధేయతగ చేయవలసివస్తుంది. ప్రజాభిమానానికి మారుగా Government Order జీవిత పరమావధియై పోతుంది. ఒకరికి తలమ్ముకొన్న తర్వాత రెండో విషయం చూసుకోడానికి వీలుండదు. విజ్ఞానాభివృద్ధికి తీరిక వుండదు. అందుకే Bernard shaw "Of all the damnable waste of human life that was euer inuented clerking is the worst' మనం చేయగలిగిందేమిటంటే ఉద్యోగంలో Rule కి వ్యతిరేకంగా అది ప్రజాక్షేమంకోసమే అయినా ఏమీ చెయ్యలేము, లంచాలు పుచ్చుకోవడం నేర్చుకోవచ్చు; జీతం వస్తుందిగదాయని ధైర్యం వుండొచ్చు. మనం ప్రభుత్వంలోని వాళ్ళమని, మనల్ని ఎవ్వరూ ఏమీ చేయలేరని నిబ్బరముండొచ్చుగాని మానవప్రేమకు వ్యతిరేకంగా, సాటి మానవుల

మీద స్వారీచేయడానికి కళ్ళెములందిచ్చే ఉద్యోగం స్వీకరించడము తప్పు. అందులోను హిందూదేశంలో ప్రజలు నూటికి 90 మంది నిరుపేదలు; అందరూ చదువురానివాళ్ళే, తన్మూలంగా ఐకమత్యత సహనము ఉండవు యీప్రజలకు. వీరిచేత దారిద్ర్యము, అవినీతికార్యాలు చేయిస్తుంది. అటువంటప్పుడు యీదేశంలో చదువుకొన్న కొద్దిమంది ప్రభుత్వోద్యోగాలు స్వీకరిస్తే విద్యావిహీనానికి ఐకమత్యత నేర్పి అన్ని విషయాలు నోటితో చెప్పి మంచిత్రోవ తొక్కించి దారిద్ర్యనివృత్తి కల్గజేసేవారెవరు? పోనీ, ఉద్యోగాలు చేస్తూ ఆపని చేయడానికి వీలుందాఅంటే లేశమాత్రేను ప్రభుత్వము ప్రజాసంఘాలేర్పరిచి విద్యాభివృద్ధిగరిపి వారిచేత దేశోపయోగాలైనపనులు చేయిస్తుందా, చేయించదు. అది ఏ Procedure Code లోను ఉండదు. అందుచేత ఉద్యోగము విసర్జించి కష్టమో నష్టమో భరించి ప్రజలకు సంఘీభావము నేర్పి ఐకమత్యంవలన ఏపనిలోనైనా వారలా అభివృద్ధిలోకి రాగలరో తెలియజేయడము ప్రతి చదువుకొన్నవాడికి యీ దేశంలో బాధ్యత. అలాకాకపోతే యిప్పటికే దరిద్ర్యబాధతో క్రుంగిపోయిన దేశం కొద్దిరోజుల్లో నామరూపాలు లేకుండా పోతుంది. ఏవిధంగానైన, కొద్దో గొప్పో చేతనైనంతవరకు ప్రజోపకారిగా వుండాలని ముకుందము వుద్యోగము విసర్జించేడు. కళాశాలలనుండి బానిసత్వాని కలవాటుపడి ఉద్యోగమే గొప్పదని అనుకునేవారు, అతనెందుకు పనికిరాడను

కొన్నారు. ఉన్న విద్యార్థులు, తమవలె అతను ఒక వుద్యోగము సంపాయించుకుంటే బాగుండుననుకొన్నారు. అతనిమాటలు వినడాని కలవాటుపడిన పెద్దవారు, అతడు చాల గొప్పవాడనుకొన్నారు, ఎవరేవిధంగా అనుకొన్నా అతడు పెడచెవిని పెట్టి యితర దేశాల్లోని మార్పులు, ప్రభుత్వాలు, ప్రజల బాధలు, తన్నివృత్తికి చేసే సాధనాలు తెలుసుకోడానికి యెక్కువ చదవడ మవసరమని వివిధపుస్తకాలు విదేశీయులు స్వదేశీయులు వ్రాసినవి జాగ్రత్తగా చదువుతూ అందులో ఒకవిధమైన ఆనందాన్ని పొందుతాడు. తెలియనివాళ్ళకు ఆవిషయాలు విప్పి చెబుతూ వుంటాడు. వాళ్ళు చాల సంతోషిస్తారు. చదువులలోవున్నవారు, తెలుసుననుకునేవాళ్ళు మనకంటే వీడి కెందుకెక్కువ తెలియాలా అని అసూయపడతారు. ఏది ఎలాఅయిన చదువు ప్రజాసేవ తనజీవితపరమావధిగా పెట్టుకొని తన్నిమగ్నుడై యుంటాడు ముకుందము.

# IV

మర్నాడుదయం ముకుందం స్నానంచేసి తెల్లని ఖద్దరు వస్త్రాలు ధరించేడు. లీల కాఫీ తీసుకొచ్చి యిచ్చింది. కాఫీ అయినతర్వాత అతను బయటకు వెళ్లిపోతున్నాడు సిగరెట్టు కాల్చుకుంటూ. ఎక్కడకు అన్నయ్యా అని ముద్దుగా అడిగింది లీల. ఎక్కడకు లేదమ్మా ఊరికే ఊళ్ళోకి వెళ్ళి నలుగురు స్నేహితులను చూద్దామని అన్నాడు ముకుందము. అలా టవునులోకి వెళ్ళి కనిపించిన స్నేహితులతోను పరిచితులతోను మాట్లాడి పీలకైనంతవరకు చదువుకొంటుంటాడు. అతనంటే అందరకు గౌరవం. భయం కూడాను. ఏ మాటైన ఎంతవారికైన అవసరమని తోచినప్పుడు అనక మానడు. తన మూలంగా ఎట్టి విపత్తు లాపాదించినా లెక్క లేదు. ఇంటి దగ్గర లీల అన్నయ్య రాక కెదురు చూస్తుంది. అన్నయ్య ఎంత మంచివాడు. . కాని లోకంలో చెడ్డవాడనిపించుకొంటున్నాడు.

అన్నయ్య వ్యభిచారి; తాగుతాడు, సిగరెట్లు కాలుస్తాడు. ఆ గుణాలు మాన్పిస్తే అతడారాధ్యదేవత లోకానికాదర్శం. అది నేను చెప్పి మాన్పించలేనా అదిగాకపోయిన తాగడమొకటి అన్నయ్యాకెవ్వరికీ లేదీ దురలవాటు బంధుకోటిలో లేనివని అవరదిష్ట. నేను చెబుతాను అలా చెయ్యవద్దని వింటాడా? అన్నకదా; వినడు సరికదా నాతో

మాట్లాడకు కూడాను. అలా చెప్పడం అతనికి నామీద ఉన్న ఆదరం పోగొట్టుకోవడం తప్ప మరేమీ లేదని ఈవిధంగా ఆలోచించుకొంటూ వండుకొంది. వాళ్ళమ్మ లీలా భోజనానికి రా అంటే; అన్నయ్య వచ్చాకా తింటానంది. అన్నయ్యెక్కడో స్తాడు నువ్వెప్పుడిదాకా వుండలేవు. వస్తాడో రాడో, లే అమ్మా వాడితో యేమిటి అంటే వద్దమ్మా నా కాకలి లేదని మళ్ళీ ఆలోచనలో మునిగిపోయింది లీల. కొంతసేపటికి ముకుందము వచ్చేడు. ఆత్రంగా లేచింది లీల మందహాసానందంతో. దబ్బున నీళ్ళిచ్చి అమ్మా అన్నయ్య వచ్చేడు. మా యిద్దరకు వడ్డించు దబ్బున అంది లీల. తల్లి వంటగదిలోంచి వచ్చి యింతసేపేం జేస్తున్నావు ముకుందం? నీ కోసం చెల్లి కనిపెట్టుకొని కూర్చుంది. అని వాక్యము పూర్తి చేయకుండానే ఏమీ చేయడములేదు వడ్డిద్దూ దబ్బున ప్రశ్నలు కురిపిస్తావు యింటికి రాగానే అని గసిరేడు ముకుందము. కోప్పడతా వేమిటన్నయ్యా అమ్మ ముద్దుగా అడిగితే అన్నింటికి కోపమేనా అంది లీల. నువ్వేమి అనకమ్మా సన్ను తిడతాడని ఆ సోదరీ సోదరుల్లకు వడ్డించింది వారి తల్లి రెండు కంచు పళ్ళాలలో. ఆ భోజనం అధిక ధనప్రమత్తులైన జమీందారులకు, రుచికరమెరుగని పేదవారలకు మధ్యరకంగా వుంది. భోజనానంతరము ఎండని పాటించకుండా వెళ్ళిపోవడానికి జోడు తొడుక్కుంటున్నాడు ముకుందం. ఆ దేమిటన్నయ్యా! రాత్రింకా కథ చెప్పుతూ మేలుకొన్నావు కొంచెం పండు

కోరాదు, సాయంత్రం వెళ్ళొచ్చు పికారు.

ము:— నాన్నగారు రాలేదా?

లీ: లేదు ఈ వేళ రారు.

ము: రాత్రికి రారా? ఈ వేళ కూడా ఇంటిదగ్గర పండుకో వాలా ఏమిటి? చచ్చాం.

లీ: ఏమిటన్నయ్యా బయట మహా మిగిలిపోతోంది? ఆ కథ ఈ వేళ పూర్తి చేద్దువుగాని.

ము: సరేలే అని వెళ్లిపో బోతుండగా లీల అడ్డము వచ్చి ఉండు అన్నయ్యా కూర్చుందూ ఎందని ఎక్కడకు వెళ్లి పోతావు. సాయంత్రం కాఫీ తాగి వెడుదువుగాని. ఔను అన్నయ్యా సాయంత్రం నువ్వు కాఫీ ఎక్కడ తాగుతావు? ఇంటికి రావుకదా అని ప్రశ్న పరంపర కురిపించింది.

ము: ఎక్కడో ముష్టి, నా లాంటి కొంప కొంపకు తిరిగే వాడికి ఏమిటి. ఎక్కడో ఒకచోట తాగుతాను.

లీ: అంత ప్రారబ్ధం ఏంవచ్చింది. ఇంటికి రాకూడదు?

ము: ఇంటికా! లంక మేత గోదావరి ఈతాను.

లీ: పోనీ కాఫీ వేళదాకా ఇక్కడే ఉండి కాఫీ కాస్త తాగేసి వెళ్ళరాదూ!

ము: సరి, సరీ, భోజనానికి కూడా రాకుండా వుండామని అనుకుంటున్నాను. పెద్దవాళ్ళు ఎవరూ లేక వస్తు న్నాను. పెద్దవాళ్ళుంటే మీకు శ్రమ యివ్వకపో

దును అని ఐగు సిపాయిలు మాత్రం మాట్లాడి వెళ్లి
పోయాడు ముకుందం మహాపని మించిపోతున్నట్టు.
ఇంత్రే ప్రతిరోజూ వెళ్లడం, ఎక్కడో బాతాఖానీ
కొట్టడమో, చదవడమో చేస్తూ వుంటాడు ముకుం
దం. ఉంటుందంటే కష్టంగా ఉండదుమరి, తలిదండ్రు
లకు. సరే మళ్ళీ తరువాత సాయంత్రం వచ్చాడు
స్నానభోజనాదు లయ్యాక చెల్లీ తను కూర్చున్నారు.
కులాసాగా కబుర్లు చెప్పుకొంటూను. ఆ తరువాత
అతడు చాలా నెమ్మదిగ, చనువుగా మాట్లాడడం,
అదును తీసుకొని లీల కొన్ని ప్రశ్నలు వేయడానికి
పూనుకొంది. ఆడవాళ్ళు ఎప్పుడూ అంతే లెండి.

లీల: అన్నయ్యా నీవు ఎందుకలా సిగరెట్లు కాలుస్తావు
అసలే నీరసంగా ఉంటావు దానికి తోడు సిగరెట్లో
కటా.

ము: దానివల్ల వచ్చిన నష్టమేముంది?

లీల: ఏముందంటావు ఏమిటన్నయ్యా? ఏమీ లేకపోవడ
మేమిటి? ఏం మానెయ్యకూడదు? మానలేవా?

ము: మానలేకపోవడం ఏమిటి కాని ఇప్పుడు యేంవచ్చింది
మానెయ్యటానికి? కరువు యింకా తీవ్రరూపందాల్చి
నట్లయితే ఎలాగు మానెయ్యవచ్చు

లీల: ఏం?

ము: ప్రియమైపోతాయి, అప్పుడు కొనలేం. దరిద్రులం

నిరుద్యోగులం ఎవరిస్తారు డబ్బు అని ఆమాటలు చెప్పేటప్పుడు అతి దీనంగా పెట్టేడు ముఖం. చాలా జాలిపడింది చెల్లాయి ఏంచేస్తుంది ఆడది ఏమీ చేయ్యలేదు.

లీల: పోనీ అన్నయ్యా, ఏదైనా ఉద్యోగం చూసుకో కూడదు?

ము: ఎవరిస్తారు ఉద్యోగం ఏమంత ఎక్కువ చదువుకున్నా మని?

లీల: ఏం, నీకంటె ఎక్కువ చదువుకున్నవా డెవడు, నీకంటె తెలుసున్నవా డెవడు? అఖండంగా చదువుకున్నావు అన్నీని

ము: అది పనికిరావు. ఏదో యూనివర్సిటీలో చదివి డిగ్రీలు పొందాలి, పైన ప్రపంచకం అంతా తెలిసినా లాభంలేదు.

లీల: అయ్యో పాపం ఏంచేస్తావు!

ము: ఏమిటిచేసేది వాజీవితం నేనే పాడు చేసుకొన్నాను. ఏమో ఏమైతే అది అవుతూంది. కాలానుగుణ్యంగా నడుచుకొని ప్రతివాడ్ని తైరుకొట్టమనలేని దే. అలా కానీ కాధవల్ని పొగుడుకొంటూ వాళ్ళవనకాల తిరిగితే అవుతుంది ఏదైనాను. కాని ఆత్మగౌరవంకల మనం ఆపని చెయ్యలేము. అని దీర్ఘంగా నిట్టూర్చి సిగరెట్టు పెట్టికేసి చూచాడు. అందులో సిగరెట్లు

లేవు. దగ్గర డబ్బు లేదు. చెల్లాయిఉంది. బజారులో మా కాలొకొట్టుకు వెళ్ళి సిగరెటు తీసుకువస్తాను.

లీల: ఏం అన్నయ్యా సిగరెట్లు లేవా నేను తెప్పిస్తాను ఉండు పనికుర్రవాడ్ని పంపించి.

ము: వాడికి తెలియదు మా షాప్.

లీల: డబ్బుందా?

ము: డబ్బు లేదు.

లీల: నాదగ్గర ఉంది అర్ధరూపాయి సరిపోతుందా?

ము: ఎక్కువ. మూడణాలుఅయితే చాలు, అని నవ్వుతూ, నీ దగ్గర ఇంకేమీ లేదా అని ప్రశ్నార్థకంగా చూశాడు లీల వైపు.

లీ: లేదని తలవూపింది. అంతలో సిగరెట్లుకు వెళ్ళినవాడు వచ్చాడు. ఆత్రంతో పిపాసాబాధితుడు మంచినీళ్ళ నందుకున్నట్లు సిగరెట్టు పెట్టె చించి, ఒకటి ముట్టించాడు. అతనా సిగరెట్టు కాల్చుతూ ఉంటే పొగ మంచుతుషారం మల్లే పైకి లేస్తోంది. ప్రపంచక సుఖదుఃఖాల అన్నింటినీ జీర్ణించుకున్న మనిషిలాగ కనిపిస్తున్నాడు ముకుందం. ఏదో మహా విషాద వేదనా వివశుడై కార్యాకార్యాలోచన చేస్తున్నాడు. ప్రేమకు జాలికి ఆటపట్టయిన అతని హృదయారవింద మకరందాన్ని చవి చూడగలుగుతోంది లీలావతి.

అతనిలో లేని మంచితనం, ప్రపంచంలోనే లేదను కొంది. అటువంటి వానిచేత చెల్లీ అని సంబోధింప బడడం అదృష్టమనుకొంది. అతని త్యాగానికి హద్దు లేదు. ప్రేమించిన వానికోసం ప్రాణాల ర్పించగల సమర్ధుడు. నిత్యమూ పేదల అభివృద్ధికోసమే ఆలో చిస్తూ వుంటాడు. అని అనుకుంటూ అన్నయ్యా ఏమిటా ఆలోచన అనిప్రశ్నించింది.

ము: మనం పేదవాళ్ళం

లీ: అయితే ఏమిటి ఇప్పుడు?

ము: ఏమీ లేదు ధనవంతుల ఒక్క వృక్షా కీల్పుకు పది రూపాయిలు ఖర్చు అవుతుంది. వారు ఒక్కమారు వేసుకొన్న దుస్తులు కొన్ని వందల ఖరీదు చేస్తాయి. ఆకలి అంటే ఏమిటో వారికి తెలియదు. అమిత ధనంతో కట్టిన సౌధాలలో వారు నివసిస్తారు. వాహ నారూఢులై విహరిస్తారు. వారిసామీప్యాన్నే లెక్క కు మించినన్ని గుడిసెలు. వాటిలోని పీడితప్రజానీకం కుక్కమురుగు సంతానం. క్షుదాపీడితోదరాలు. ఎంత వ్యత్యాసమో చూశావా? పేదల చెమటలతో నిర్మిం పబడిన సౌఖ్యంలో ధనవంతులు సుఖిస్తారు! పేదల బాధలు ధనవంతులకు తెలియవు. పేదవారు అసం ఖ్యాకులు, ధనవంతులు బహు కొద్దిమంది. లక్ష్మి ధనవంతుల యింట బానిస. ధనం వారి యింటిలో

మూలుగుతూ వుంటుంది. అసంఖ్యాకులైన పేదలకు అత్యవసర పదార్థాలకు కూడ లోటు. ఈ విధంగా పేదలు ధనవంతుల సౌఖ్యంకోసం కష్టపడవలసిన పద్ధతి మీాద వున్నది ప్రపంచం. ఎంత ఆశ్చర్యం!

లీ: నిజమే అన్నయ్యా ఆకలికి అల్లాడిపోతున్న పేదవారి గొడవే లేకుండా ధనవంతులు హాయి ననుభవిస్తారు. అవును వారికి డబ్బువుంది, వారు అనుభవిస్తారు. ఒక గొడవ వారికేల?

ము: ఎక్కడనుండి వచ్చింది వారికాడబ్బు?

లీల: భగవత్ప్రసాదము. పెట్టివుట్టారు.

ము: భగవత్ప్రసాదం! పెట్టివుట్టారు!! ఎంతమూఢనమ్మకం చెలాయి.

లీ: మరి ఏమిటి?

ము: ఏమిటా? వాళ్ళధనం? కొద్దిమందికిఉపయోగించిప్రపంచంలోని కొద్దిమందికి ఉపయోగించదా? భూమిలో నుంచి త్రవ్విన బంగారం త్రవ్విన వారికేఉపయోగపడదా? పండించిన పంటలు పండించినవారుఉపయోగించుకోవడానికి వీలులేదా? వీలైతే సూర్యుణ్ని వాళ్ళ దొడ్లోనే కట్టేస్తారు. వర్షాల్ని వాళ్ళ పొలాల్లోనే కురిపించుకుంటారు. ప్రజల్లోఐకమత్యం ఉంది వాళ్ళకు జ్ఞాన ప్రబోధం కలిగి దేశోద్ధారకులు బయలుదేరి మతం ఖర్మ అనే మూఢ నమ్మకాలలోనుంచి

మేల్కొలిపి, పరిపూర్ణ విశ్వాసంతో పురిగొల్పితే అప్పుడు తెలుస్తుంది. ఆ ధనమెవరిదో ఆ ధాన్యాలెవరివో.

లీ: ఏం చెయ్యగలం అన్నయ్యా దొంగతనం చెయ్యమంటావా, దోపిడీ చెయ్యమంటావా, తప్పుకాదూ?

ము: అంతమంది ప్రజల్ని ఆకలి పాలుచెయ్యడ లో లేని తప్పు ప్రజల కడుపుకోసం ప్రయత్నించడంలో ఏంవుంటుంది? పోనీ అటువంటి పరిస్థితి ఏర్పడకుండా వారే చూడకూడదు?

లీ: పోనీ అప్పుడు ప్రభుత్వం వూరుకుంటుందా?

ము: ప్రభుత్వం మాత్రం ధనికవర్గంకాదా ప్రజల మంచి చెడ్డలు చూడలేనిది ప్రభుత్వం ఏలా అవుతుంది? దానిగౌరవం నిలబెట్టే బాధ్యత ప్రజలకెలా వుంటుంది? అవసర పదార్థాలు లేక బాధపడే ప్రజల ఇక్కట్టులను తీర్చలేని ప్రభుత్వాన్ని ప్రజలు గౌరవించి సువర్ణ డోలికలలో ఊపాలా?

లీల: అయితే ఏలాగు ఇప్పుడు ఏం చెయ్యాలంటావు?

ము: ప్రజాప్రభుత్వం ఏర్పడాలంటే సామాన్యప్రజలచే ఎన్నుకోబడినవారిచేతిలో అధికారం ఉండాలి, ఆఅధికారాన్ని దుర్వినియోగం చెయ్యకుండా ప్రజాసామాన్యంకోసం పాటుపడాలి. ఇవన్నీ ఎందుకు దేశసౌభాగ్యం. దేశంలో అందరికీ ఉపయోగపడేటట్టు సహా

కారపద్ధతులు అమలుపెట్టాలి ఒక్కొక్కనికి ధనం
నిరుపయోగంగా ఉండకూడదు అనేకమంది క్షుధా
బాధితులు కాకూడదు. పోనీ సోమరి పోతులై పని
చెయ్యనివారికి అన్నం లేదంటే సబబుకాని కష్ట
పడి రక్తం ధారపోసి సూర్యోదయం మొదలు
సూర్యాస్తమయంవరకు స్త్రీ పురుష సంతాన
సహితంగా పనిజేసేవారికికూడా కడుపు నిండ
కుండాపోయి ధనవంతులు విలాసంగా సర్వసమృ
ద్ధిగాను జీవిస్తున్నారంటే ఎంత హేయమైనవిషయం!
నిరుపేదల నిర్మితాలలో ధనవంతులు హాయిని
అనుభవిస్తారు ఇదంతా తప్పు. ఇదంతా పోవాలి.

ఏ: ఈవ్యత్యాసం ఎప్పటికైనా పోయి భేదరహితమై సర్వ
జన సానుకూలమైన యేర్పాటు యేదైన రావడా
నికి వీలుందా అన్నయ్యా?

ము: లేకేమి వచ్చితీరుతుంది కొన్ని దేశాల్లో వచ్చింది
ప్రపంచ చక్రం ఆవైపుకే తిరుగుతోంది. గమ్య
స్థానం నేడో రేపో చేరుకోగలం. సామాన్య దరిద్ర
మానవులకు ఉద్రేకం కల్పించి, ధనవంతుల ద్రోహా
లు విశదీకరించి వారికుట్రలను, నిర్నిమిత్త సౌఖ్యా
నుభవాలను అరికట్టించే ఉద్యమం లేవతీయించాలి.

ఈఉద్యమానికి ఆటంకాలు కలుగజేస్తారు ధనికులు. ఈఉద్యమాన్ని నడిపించే దీక్షాశూరు లెందరో దీనికి బలికావలసి ఉంటుంది. అయినప్పటికి మానుదీయక త్యాగబుద్ధితో పనిచేస్తే గమ్యస్థానం చేరుకోగలం.

లీ: అదేమిటి అన్నయ్యా నువ్వుచెప్పిందిబాగులేదు కేవలం రక్తపాతానికే హేతువైననీసలహానాకునచ్చడంలేదు.

ము: నచ్చదు క్రమక్రమంగా కొన్నిలక్షలమందిని మృత్యుదేవతకు ఎరజేసే ధనికవర్గ విధానం నీకు అర్థంకాలేదు. కాబట్టి వారిదౌర్జన్యం నీకుబోధపడలేదు ప్రజల సంఘీభావం ఏర్పడి కొంత అలజడి జరిగిన పిమ్మటనే సర్వజన కల్యాణప్రదమైన సువర్ణ యుగం ప్రారంభిస్తుంది. ఈ ఉద్యమంలో ఏదైన దౌర్జన్యం సంభవించినట్లయితే అది స[redacted]న ధనవంతుల మూలాన్నే సంభవిస్తుంది మహామహులు ప్రపంచక ఐశ్వర్యాన్ని కొలిచి దాని భోగమనుభవించే వారి పరిమితి లెక్కించి, వారికోపం, బాధపడే పేదలు అసంఖ్యాకులని విశదంగా లోకానికి గ్రంథ రూపంలో తెలిపేరు. కార్యశూరులు ఎందరో దీనిని లోకంలో అనేకచోట్ల ఆయాదేశ పరిస్థితులకు అనుగుణ్యంగాఅమలుపర్చడానికిప్రయత్నిస్తున్నారు.ఈస్వాతంత్ర్య పోరాటం ఏప్రదేశంలో ఏపరిస్థితులలో ఏరూపం దాలుస్తుందో ఆయా ప్రదేశాలలోనే ప్రజానా

యకులే నిర్ణయించి తదనుగుణ్యంగా, ఉద్యమాలు
లేవతీయించి గమ్యస్థానం జేరుకోవలసి ఉంటుంది.
ఇవన్నీ నీకు తెలియవ్వలే టయిమెంతో!

లీ: ఎనిమిదీ ముప్పయి అయింది. అన్నయ్యా, నీతో మా
ట్లాడుతూ ఉంటే కొత్తప్రపంచం గోచరిస్తూంది.
నువ్వు ఎప్పుడూ నాదగ్గరే ఉంటే నాకుచాలా కొత్త
విషయాలు తెలుస్తాయి నీవంటివానికి చెల్లెలనిపించు
కోవడానికిఅర్హతలేని అజ్ఞానంలో ఉన్నాను.

ము: అవును చెల్లాయి. నీపరిస్థితి చూస్తే జాలిగా ఉం
టుంది నాకు. మంచి మంచి పుస్తకాలు అన్నీ ఇంగ్లీ
షులో వుంటాయి కాబట్టి నువ్వు రేపటినుంచి ఇం
గ్లీషు ప్రారంభించు. ఒక్క సంవత్సరం నీకు బాగా
ఇంగ్లీషు నే[illegible]స్తకాలు యిస్తాను, నువ్వే చదివి
విషయాలు తెలుసుకోవచ్చును.

లీ: తప్పకుండా నేర్చుకుంటాను, చాలా సంతోషం,
నువ్వు సరిగ్గా ఇంటిదగ్గర వుండవేమో మరి.

ము: నీ వంటి పరిశుద్ధ చరిత్రకు చదువు చెప్పడంకంటే
నాకు కావలసినది ఏముంది! నీవు ఎప్పుడూ అలాగ
అనుకోకు.

లీ: సరే అన్నయ్యా కథ చెప్పు. నిన్న చెప్పినదగ్గరనుంచి
ఇప్పటిదాకా పేదా,గొప్పా ఉపన్యాసముతో
గడిపేము.

ము: కథా, ఓయస్, ఎంతవరకు అయింది నిన్న?

లీ: నిన్నా? ప్రభాకరం రాధను మర్చిపోయాడు. జ్ఞాపకం వుంచుకోవలసినంత అగత్యం లేదు అతనికి. అతను కేవలం శ్రీకృష్ణమూర్తి అని చెప్పేవు.

ము: అలాగే. సుఖ దుఃఖ దూరమైన కాలచక్రం విద్యుక్త ధర్మాన్ని సాగిస్తూంది. మన కథానాయకీ, నాయకులు ఒకరి నొకరు చూచుకోవడమే కాని సంభాషణ లేదు. రాధ ఆవేదనా భారంచేత ఏమైనా సరే ప్రభాకరాన్ని పుస్తకాలు అడుగుదామనే కారణాన్ని పురస్కరించుకొని, ఒక్క ఉత్తరం వ్రాయడానికే సిద్ధపరచుకొంది, ఇలా వ్రాసింది.

ప్రభాకరరావుగారు,

మీరు ఆరోజున మా ఇంటిదగ్గర రెండు పుస్తకాలు మీరు వ్రాసినవి పంపిస్తానని వాగ్దానం చేశారు. కాని పంపలేదేం? ఏమిటంత నిర్దయ, అనుక్షణం మీ భావగంభీరమైన కవితా సుధారసాన్ని ఆస్వాదిస్తూన్న నాపైకూడ మీకింత నిర్దయా? క్షమించమనికాదు. ఆడది మగవానికి ఏవిషయమైనా కూడా యిలా ఉత్తరం వ్రాయకూడదని మీ రెరుగుదురు. అయినప్పటికీ తెగించి పట్టుకోలేని అనురాగంతో ఈవుత్తరం వ్రాస్తూవున్నాను. నా మనస్తత్వం తెలుకోలేని పరిస్థితిలో ఉన్నారు. మరిమీరు కవులుకదా సర్వం తెలుసుకోగల సమర్థులు. మీకు ఎక్కువ వ్రాయనక్కరలేదు. ప్రేమను బెట్టు

సరి, పట్టుదల ఉండకూడదు. నాహృదయం మీ ఆధీనం; మీరు వెంటనే జవాబువ్రాసి యీ అమ్మాయిచేతికియిచ్చి పంపించండి. పుస్తకాలుమర్చిపోకండేం?

మీ రాధ.

అని వ్రాసి ఊహాపోహాలు తెలియని పిల్లచేతికి యిచ్చి అంద జేస్తుంది. అతడు దానిని శాంతంగా చదివాడు ఉత్తరానికి జవాబు రేపు యిస్తాను రమ్మన్నాడు. రాధమాత్రం తబ్బి బ్బు అయిపోతుంది, అతడు అసాధ్యుడు. ఏ అవాంతరం తీసుకువస్తాడో అల్లరిచేస్తాడో యేమిటో అని అతనిదగ్గర నుంచి ప్రత్యుత్తరం వచ్చేదాక ప్రణయ కార్యారంభంచేసే ప్రతీమనిషి బాధపడ్డట్టే తనూ బాధపడింది.

లీ: చాలా పెంకివాడులాగున్నాడు ఏం వెంటనే వ్రాయ కూడదూ? ఒకరోజు హైముకూడా ఏందుకో దొరగాలేకి?

ము: ఆలోచించి వ్రాద్దామని అంతే. అతనిహృదయంలో యిలా ఆలోచించడం మొదలు పెట్టేడు

అవివాహిత,ఐశ్వర్యవంతుల పిల్ల. మనమాటకేం మగవాళ్ళం మనం ఎంతమందితో సరసాలు ఆడినా యిబ్బంది లేదు. యీ అమ్మాయి విద్యావతి. విశేషించి వినయవిధేయతలు కలది. ఒకవేళమనం ఆమెతో పరిణయ వ్యాపారం సాగిస్తే అది అల్లరిలోకివస్తే పిల్ల జీవితం గంగాప్రవేశం అవుతుంది. ఆడవాళ్లకు పురుషేచ్ఛ కలిగినప్పుడు యుక్తాయుక్త వివేచన

జ్ఞానం ఉండదు. దానివల్ల తనభవిష్యత్తు దెబ్బ తింటుంది. జవాబు వ్రాయకపోతే మరీ చింతిస్తుంది. అని ఇలా అను కొని కడకు ఉత్తరం వ్రాయడానికే పూనుకున్నాడు.

లీ: ఓహో గ్రుడ్డిలోనూ మెల్ల అన్నట్టు చెడ్డలోను మంచి ఆలోచిస్తువ్నాడు. గొప్పవాడులాగే ఉన్నాడు.

ము: మరి ఏమనుకుంటున్నావు అందులోనే వుంది గొప్ప. ఇద్దరుకలిసి దొంగతనంచేసినా దాన్ని సమానంగా పంచుకుంటారు. దొంగలు కాళికా దేవికి బలియిస్తారు దొంగతనం పారితే కానుకలిస్తామని మ్రొక్కుతారు. మాఅబ్బాయికి ఉద్యోగంవస్తే వ్రతం చేయిస్తామన డం ఎంతో మాకు దొంగతనం పారితే మేకను బలే స్తామనడమూ అంతే. పైనభగవంతునికి తెలవితేటలు ఉండి స్వార్థపరుడు కాకుండా ఉండాలిగాని జర్మనీ వోడిపోవాలి మేము గెలవాలనిఇంగ్లీషువారు వాళ్ళు ఓడాలి జయం మాకురావాలని జర్మనీవారు ఇలా యిరుపక్షాలు ఒక్కభగవంతుడినే గుడులు మారు మ్రోగేటట్టు ప్రార్థిస్తారు. పాపం చెల్లాయి భగవం తుడిది నిజానికి చాలా ప్రమాదకరమైన పదవిసుమా రాజ్యాన్ని దోచుకొనడానికి ఇంకొకరాజ్యం ప్రయ యత్నం చేయడం దొంగతనంకంటె ఎన్నోరెట్లు హెచ్చు. ఒక బలీయమైన జాతి మరొకజాతిని నిర్దా క్షిణ్యంగా దోచుకోవడం కనక, మానవలోకానికి

ఇటువంటి ఘాతుక కృత్యాలు చేసేటప్పుడుగూడా భగవత్సహాయమే కావాలి.

లీ: ఏమి విచిత్రమైన విమర్శనలు అన్నయ్యా నీవి!

ము: ఏం నచ్చలేదా?

లీ: ఆహా నచ్చకకాదు, నవ్వొస్తోంది. అంతా క్రొత్తదనం సరే, ఆఖర్కు అతను ఉత్తరం వ్రాసేడా లేదా?

ము: వ్రాసేడు, వ్రాసేను. వ్రాయకపోతే రాధ ఏమైపోతుంది? ఏమంటావు చెల్లాయి? అని సిగరెట్టు ముట్టించాడు,

రాధా!

నువ్వు వ్రాసిన ఉత్తరం శాంతంగా చదివాను. నీవు నిష్ప్రయోజనమైన కార్యానికి తలపెడుతున్నావు. అంటే అపార్థం తీసుకోకు. నాకు నీమీద ప్రేమాభిమానాలు లేకపోలేదు. అయితేమాత్రం ఏం చెయ్యగలను? నీక్షేమంకోరి ఒక్కటి చెబుతాను విను. నీవునవయవ్వనవతివి, విద్యావతివి, చక్కని చందమామవు. పెద్దింటిదానవు, అవివాహితవు నేను యవ్వన మదంచేత దుష్ప్రవర్తనకు లోనై అన్నివిధాల చెడిపోయిన వాడ్ని. అనారోగ్యంచేత బాధపడే నామీద మమకారం పెట్టుకోవడం అంత మంచిపనికాదు. రత్నం రాజుకేకాని సామాన్య మానవులకుకాదు. యవ్వనాన్ని యవ్వనం, సౌందర్యాన్ని సౌందర్యం మాత్రమే సాధించగలవు. లోకాన్ని

మూర్ఛింపజేసే కోయిలపాటలు కాకులకు వినువు. కవిత్వం బాగుంటే బాగుండవచ్చు. అంతమాత్రంచేత నేను పరిపూర్ణ మానవుణ్ణి అనుకోవడం పొరపాటు. స్త్రీపికనుక నీకు విమర్శనాశక్తి తక్కువయి ఉండవచ్చు. పుస్తకాలు యేలాగు పంపుతాను. దానికేంకాని నీహృదయం నా ఆధీనం చెయ్య డం లంచగొండుకే అధికారముద్ర యిచ్చినట్టు. ఆలోచించు నీక్షేమం కోరే చెబుతున్నాను. తొందరకూడదు.

ప్రభాకరరావు.

అని ఈవిధంగా ఉత్తరం వ్రాసి రాధకు అందజేసేడు. రాధ చాలా ఆశ్చర్యపోయింది.

లీ: ఆశ్చర్యపోదూ! అద్భుతమైన రచన.

ము: కవికాదూమరి అంచేత

లీ: నూతన ఫక్కీ.

ము: అప్పుడు రాధ చాలా సంతసించి అతను ఎలా వ్రాసి నా ఆమెపయి అతనికి అభిమానం ఉందని వ్రాసినం దుకే మురిసిపోయింది. అన్నివిధాల చెడిపోయిన వాడా ప్రభాకరం? కాదు. భావగంభీర రచనా ప్రక ల్పకుడు, సద్గుణశీలుడు.దురలవాట్లకేం? ముక్కుపొడుం దురలవాటుకాదూ? ఎందరు పండితులకు ఆఅలవాటు లేదు? పరోపకారి. నిర్లక్ష్యం ఉంటేమాత్రం ఎవ్వర్ని అలక్ష్యం చెయ్యడు. వేశ్యవాడల్లో తిరుగుతాడూ, తిరిగితేమాత్రం? సర్వసమర్థుడు. అతను ఏంచేసినా

తప్పులేదు ఇంట్లో కాఫీ ఉన్నప్పుడే హోటలు కాఫీ చవి చూడని మగవాడు లేడు. అవివాహితుడు వేశ్య వాడల్లో తిరగడంలో తప్పేముంది? దొంగకాదా హంతకుడు కాదూ అబద్ధ ప్రలాపికాదూ. వాళ్ళూ ఘన్యనీయులు సంఘంలో. కవి బుద్ధికుశలత కలవాడు పరోపకారి. వాక్చాతుర్యానికి అందెవేసిన చెయ్యి. విజ్ఞానంలో అతన్ని చెప్పి చెప్పాలి. ఇంక కావలసింది ఏముంది? లోకం. లోకానికేం తెలుసు అతని బాహ్య ప్రవర్తననుబట్టి నిర్ణయిస్తుంది. అతని తరగతి" అని ఈవిధంగా పరిపరివిధాల సరిపెట్టుకుంటూ కూర్చుంది రాధ.

లీ: సరే తరువాత ఏమయింది? ఏమైనా అన్యోన్యాను రాగం ఫలోన్ముఖానికి వచ్చిందా?

ము: గాకేనవాతుంది కొంసకు. కాని, తరువాత మళ్ళీ ఆ గొడవ అప్రస్తావన యేమీ లేకుండా గడిచి పోయాయి కొన్ని దినాలు. ముందు చెప్పేనుకదూ వాళ్ళకీ వాళ్ళకీ స్నేహమని. అంచేత మేస్త్రీటుగారి ఆడవాళ్ళు ప్రభాకరంగారి యింటికి చూడ్డానికి వెళ్ళ నిశ్చయించుకున్నారు, రాధ తల్లి మేడమీద చదువు కొంటున్న రాధతో అమ్మడూ నాన్నగారు ఆఫీసుకు వెళ్ళేరు దబ్బున నువ్వూ భోంచెయ్యి ప్రభాకరరావు గారి యింటికి వెడదాం అనగానే రాధ ఉల్లాసంతో

లేచివచ్చి దబ్బున భోంచేసి గదిలో టోయలెట్ అవుతుంది. ఇంతలో బండివచ్చి వీధిగుమ్మంలో ఆగింది. అమ్మడూ అయిందా ముస్తాబు అని వాళ్ళ అమ్మ అనగానే అయింది పద అని బండిదగ్గరకు వచ్చింది అమ్మడు. రాధ చక్కని చీర కట్టుకుంది, సరే, బాడీ దానిపైన మంచి జాకెట్టు. కాళ్ళకు నిగనిగలాడే జోడు. పద్దెనిమిదేండ్ల నిండు యవ్వనంలో వున్న పిల్ల. ఎటువంటి కురూపులైనా యవ్వనంలో కళ కాంతులుతో ఉంటారు. అటువంటప్పుడు రాధ సహజ సౌందర్యవతి విషయంలో వేరే చెప్పాలా రాధ ప్రతీ అవయవంలోను ప్రత్యేకత వుంది ప్రయాణం ప్రభాకర్రావుగారి యింటికి. కనుక అందానికి తోడు ఆనందం ఒకటి, కాని ప్రభాకర్రావు యింటిదగ్గర ఉంటాడా ఉండడా అనే ఆలోచనతో పై గోడనలన్నీ లెక్కచెయ్యకుండా ఊహాప్రపంచంలో మునిగిన భావకవివలె యేదో గ్రహించడానికి వీలులేని అభినయం చేస్తోంది. ఈఆలోచనలో మునిగి, ప్రక్కకు జారినపైటకూడా సర్దుకోవడం మరిచిపోయింది. అప్పుడా దృశ్యాన్ని చూచి ఎందరో యువకులు, యవ్వనందాటినా ఊహాలు నశించని పెద్దలు తదేకధ్యానంతో పైట సడలిన, రాధా వక్షోజాలోకనా మైకంలో ప్రస్తుత విషయాలు

మరిచిపోయారు.

లీ: బాగుందన్నయ్యా నీవర్ణన. నేను వింటున్నానని నువ్వా మరిచిపోయావు అనుకుంటాను.

ము: నీదగ్గఱ నేను యిలా చెప్పకూడదుకాని, ఇంచుమించు నేను పుస్తకంలో వ్రాసినట్టుగానే చెప్పడంలోనే స్త్రీ పురుష భేదం పాటించకుండానే చెప్పవలసి వచ్చింది క్షమించు.

లీ: దానికేం తప్పేముంది? మనలో మనకేమిటి అంది, (కొంచెం సిగ్గుతో) ఆఖరుకు వాళ్లు యింటికి వెళ్ళేటప్పటికి అతను వున్నాడా?

ము: వాళ్ళు యింటికి వెళ్ళగానే ప్రభాకరావు తల్లి వాళ్ళను ఉచితంగా ఆదరించి కూర్చోబెట్టి ఆకబుర్లు, ఈకబుర్లు చెబుతోంది. రాధ తల్లి:-భోజనాలు అయ్యాయా-అని అడిగింది ఆవిడ ప్రభాకరావు రాలేదమ్మా రాత్రి రాలేదు, ఎక్కడికి వెళ్ళేడో ఏమిటో అని జాలిగా చెప్పింది. "రాధ తల్లి:- అదేంవిటమ్మా ఎవరికైనా కబురు చెయ్యకపోయారు?" ప్రభాకరావుతల్లి:- "అబ్బే లేదమ్మా అది వాడికి అలవాటే. ఒకొక్కప్పుడు రాడు, ఒకొక్కప్పుడు వస్తాడు. వాడి బ్రతుకు స్థిరంలేదు. తతిమ్మా అబ్బాయిలు యేదో ఉద్యోగము చేసుకుంటున్నారు బాగానే వుంది. వీడు ఉద్యోగము చేయడు. జాగ్రత్తా లక్ష్యం

లేదు. వాడి ఇష్టానుసారం తిరుగుతాడు. ఏమన్నా అంటే తిట్టిపోస్తాడు.'' రాధ తల్లి: ''అయ్యో తల్లిని తిట్టడం కూడానా అమ్మా అంత దుర్మార్గుడా?'' ప్రభాకర్రావు తల్లి: ''తిడతాడమ్మా తిడతాడుకాని వాడంత జాలి, అభిమానం కలవాడు ఎవడూ లేడంటే నమ్మండి. కాని ఏమిలాభం అదంతా వాడి గ్రహచారం, పోనివ్వండి. వాడు వస్తాడేమో ఇంకొక గొడవ ఏదైనా చెప్పకుందాము, అని ప్రభాకర్రావు తల్లి చెప్పింది. ఆవిడ మాటలు రాధకు ప్రభాకర్రావుపై గల అభిప్రాయాన్ని బలపర్చాయి. 'అతడు మంచిజాలి, అభిమానం కలవాడు. కాకపోతే కొంచెం ప్రథమకోపం వుండవచ్చు. ఔను కోపం వున్న వాళ్ళే మంచివాళ్ళు అని చెబుతూ వుండేవారు మా వుపాధ్యాయులు' అని రాధ లోలోన సమర్థించుకుంటూ వుండగా తలుపుదగ్గర ధ్వని వినిపించింది. అదుగో వచ్చాడమ్మా అంటూ ఆ గృహస్థురాలు తలుపు తీసింది. తెల్లని ఖద్దరు చొక్కా, ఫాంట్లాం, బూటు, కళ్ళజోడు, చేతికి రిష్టువాచీతో ప్రత్యక్షమయ్యాడు మన కథానాయకుడు. రాధ అతన్ని చూచి గౌరవసూచకంగా చాటుకు పోయింది. కాని ఏచాటునుంచో అతన్ని తనివి తీర చూస్తునేవుంది. అంతే ఆడవాళ్ళు మొగవాళ్ళకు కనిపించకుండానే

చూస్తూ వుంటారు. మగవాళ్ళకు మాత్రం ఆ సావకాశం వుండదు. చూస్తున్నాంగా చుట్టాల ఇళ్ళదగ్గఱ. సరే అతను పక్కగదిలో కూర్చున్నాడు, వాళ్ళమ్మ నీళ్ళిచ్చి వడ్డిస్తూనే ఉందేకాని ఏమిరా నాయనా ఎక్కడికి వెళ్ళేవని అడగలేదు. ఆలాగు ఉంది ఆ యింటిలో ఆదరు.

లీ: కొంచెం యించుమించు నీలాంటివాడే నన్నయ్యా.

ము: సరేలే.

ఈలోపులో ఎవరో స్నేహితుడు వచ్చి తలుపుతట్టి ప్రభాకరం అని పిలిచాడు. ఇతను దబ్బున లేదివెళ్ళి తలుపుతీసి వీధిగదిలో కూర్చోబెట్టి వాళ్ళిద్దరు కులాసాగా మాట్లాడుకుంటున్నారు. తల్లితో ఒకమాటైనా మాట్లాడలేదు. ఆస్నేహితుడితో యేమిటి అంత చురుగ్గా మాట్లాడుతున్నాడని రాధ పొంచి వింటోంది. వింటే యేమి అర్థం అవుతుంది.

లీ: ఏం ఇంగ్లీషులో మాట్లాడారా?

ము: కాదు తెలుగే. తెలుగులోనే వాళ్ళకు పాస్టుపోండులాగు ఒక భాష ఉంది. అది వాళ్ళ యిద్దరికేతప్ప ఇతరులకు అంత సులభంగా అర్థంకాదు.

లీ: రహస్యమా?

ము: రహస్యమూకాదూ, కులాసా. అదొక క్రొత్త ప్రపంచం, నవనాగరికతో ద్రేకం, విమర్శనా విధానం రాచకీయం మరేం పనీకాదు, పాటూకాదూ సరే,

తరువాత వాళ్ళమ్మ వచ్చి వడ్డించాను బాబూ అంది. అతడు నేనూ రామారావు భోంచేస్తామని రామారావుని అడక్కుండానే చనువుగా అన్నాడు. సరే అని యింకొక చెంబుతో నీళ్ళు యిచ్చి యింకొక విస్తరవేసి వడ్డిస్తూ ఉంటే రాధ దగ్గరికి వచ్చి అత్తమ్మగారు పాపం అన్నం సరిపోతుందాండి యిద్ద ఉకూ అంది. ఆ సరిపోతూంది వాళ్ళెలాగైనా పంచుకు తినేస్తారు. అతడు బ్రాహ్మడు అని బగులు చెప్పింది ప్రభాకరావు తల్లి.

రాధ: అదేమిటండీ బ్రాహ్మలు మన యిళ్ళల్లో భోంచేస్తారా?

ప్రభాకర్రావుతల్లి: చెయ్యరు. ఎందుకు చేస్తారు? స్నేహం కనక వాళ్ళు బేధాలు పాటించరు. అంది అంత వాళ్ళిద్దరు భోంచేసి వెళ్ళిపోయారు రామారావు యింటికి. రాధ నిరాశ చేసుకుంది ప్రభాకర్రావు కాస్సేపు కూర్చోలేదు. అతని స్నేహితుడు ఇంత లోకే రావాలా అని విసుక్కుంది. తరువాత కొంత సేపటికి తల్లీ తనూ ఇల్లు చేరుకున్నారు. రామారావు ప్రభాకరం చదువుకున్నారు. అతనికి ప్రభాకరానికి బాల్య స్నేహం, అన్యోన్య అభిమానాలు. వారిద్దరి మధ్య సంవత్సరాలు రోజుల్లా గడిచిపోతాయి. వారిద్దరి సంభాషణలోను విమర్శ, నవ్వు తప్ప ఏమీ ఉండదు. రామారావు పెళ్ళి అయింది. ప్రభాకరం

రాజ్యాన్ని బాగా యెరుగును. రాజ్యం నీలాగున నే ఉండేది. గుణాలలోను రూపంలోను నిన్ను పోలుతుంది. ప్రభాకరంమీద భ్రాతృభక్తి కుదిరింది ఆఅమ్మాయికి. ప్రభాకరానికి చెల్లెళ్లు లేరు. రాజ్యానికి సోదరుడు ఉన్నా, దూరప్రదేశంలో ఉండడం చేత రాకపోకలు కలయిక అంతగా లేవు. అంచేత ప్రభాకరానికి రాజ్యానికి సోదర సోదరీభావం బలంగా యేర్పడింది. పిలుచుకోవడం కూడా అన్నయ్యా చెల్లాయి అనే చుట్టుప్రక్కలవారికికూడా, మీ అన్నయ్య వచ్చేడా అని, మీ చెల్లాయి యేంచేస్తుందని ఇటువుర్ని ప్రశ్నించడం అలవాటైపోయింది. రామారావు ఒక గుమాస్తా. కొంత వసతీ ఉంది. ప్రభాకరం తరుచు వాళ్ళ యింటికి వెడుతూ ఉంటాడు. సరే వాడిరువురూ రామారావు యిల్లు చేరుకున్నారు

రాజ్యం: (ఎదురై నవ్వుతూ) రా అన్నయ్యా ఏం అన్నయా ఈమధ్య రావడంలేదు?

ప్ర: ఊళ్ళో స్థిరంగా వుండడం లేదమ్మా. నీవంట్లో బాగుందా?

రా: బాగుందన్నయ్యా, మొన్న నీవు తెచ్చిన ఔషధములు పుచ్చుకొన్న తరువాత ఆరోగ్యంగానే వుంది.

ఇంతలో నేను ఆఫీసుకు వెడతానని కోటు తొడుక్కుంటున్నాడు రామారావు. కూర్చోవోయి అప్పుడే తొందరేమిటి

అన్నాడు ప్రభాకరం. నీకేం మీ చెల్లాయితో కొట్టు బాతా ఖానీ, అనినవ్వుకుంటూ ఆఫీసుకు వెళ్ళిపోయాడు రామారావు.

ప్ర: పాపం చాలా కష్టం రెవిన్యూ వుద్యోగం తీరిక వుండదు.

రా: అవును అన్నయ్యా చాలా బాధపడిపోతున్నారు. అవునుగాని ఏమైనా పుస్తకాలు తెచ్చిపెట్టేవా అన్నయ్యా?

ప్ర: లేదమ్మా మనస్థిమితం లేదు. ఎప్పుడూ యేదో ఒక సమస్య జీవితాన్ని ఎదుర్కుంటూనే వుందని నిట్టూర్పు విడిచి వెనక్కి కుర్చీలో జేరబడ్డాడు.

రా: ఏమిటి అలాగ వున్నావు? ఇప్పుడు నీకు వచ్చిన కష్టం యేమిటి ఆయనకు మళ్ళీ నీకూ యేదో వుద్యోగం అయితే బాగుండును. మీకూ అందుకు చింత తీరిపోనని, మాట్లాడక కూర్చున్న ప్రభాకరం వైపు చూచి యేమిటి అన్నయ్యా సైము ఎంతయిందంది. అతని విచారాన్ని త్రిప్పడానికని.

ము: చూశావా చెల్లాయి రాజ్యానికి ప్రభాకర్రావులంటే ఎంత యిష్టమో ఆలాగు వుండాలి సోదరప్రేమ అంటేను. చూడు యిద్దరూ బంధువులుకాదు. ఒక కులస్థులూకాదూ. అయినప్పటికి ఒక్క కడుపున పుట్టినవాళ్లుకూడా నేర్చుకోవాలి వాళ్ళను చూచి ప్రేమ పాఠాలు, అందికే అనురాగంగల ఒక్క

చెల్లెలు ఉంటే చాలంటూరు ప్రపంచంలో ప్రభా కర్రావు రెండయిం దన్నాడు. టైము రిస్టు చూచి.

రాజ్యం: కాఫీ పెడతాను అని లేచివెళ్లి కాఫీ పెట్టి వచ్చి కూర్చుని మళ్ళీ ఆకబురూ యీ కబురు చెప్పుకుంటూ కూర్చున్నారు. అంతట్లోకి కాఫీ అయింది. తాగుతూ మర్చిపోయాను చెల్లాయి కాకినాడనుంచి తెచ్చాను కొన్ని టాయిలెట్ సామాన్లు. అని రాజ్యానికిచ్చాడు. అవి చూచి వాటి ఖరీదు స్వల్పమే అయిన, వాటిని చూచి, అతని శ్రద్ధకు రాజ్యం సంతోషించి, వాళ్ళ త్తయ్యగారిక్కి చూపించింది. ఆవిడకూడా ప్రభాకర రాజ్యాల పరస్పర సంబంధాన్ని అభినందించి, తోబుట్టువుకన్న ఎక్కువగా చూచుకుంటున్నావు బాబూ దాన్ని, అది కూడా అట్లాగే ఉంటుంది నీ పట్ల అంది ఐకమత్యాన్ని బలపరుస్తూ.

ప్ర: నిజమేనండీ మా చెల్లాయి, నాకు చెల్లెలు లేని కొరత తీర్చింది అన్నాడు. అతను ఎప్పుడూ ఇతరులతో మాట్లాడేటపుడు కూడా చెల్లాయి అంటాడు కాని రాజ్యం అని అనడు. అని యిలా కథ చెబుతూంటే ముకుందం గత రాత్రి టీ తాగేసుగదా ఇప్పుడు కూడా త్రాగుతాడేమో అని లీల టీ పెట్టనా అన్నయ్యా అని అంది.

ము: పెట్టు నీకు ఎంత దయ చెల్లాయి నువ్వుకూడా

తాగుతానంటేనే నేను తాగుతాను అన్నాడు.

అలాగేనని నీళ్లు పెట్టింది. ముకుందు కథ చెబుతున్నాడు

అలా మళ్ళీ కొన్నిరోజులు గడిచిపోతున్నాయి రాధా ప్రభాకర సంపర్కం లేకుండానే భావాలకు యుక్తవయస్సు వస్తోంది కాని, కాలం ఆసన్నం కాలేదు. భావాలు తేనప్పుడు కాలం ఆసన్నమైనా ఏమీ చెయ్యలేరు. ఆశ్చర్యం! అన్యోన్యానురాగం ఉన్నకూడా ప్రేమికులు హృద్గతాభిప్రాయన్ని నిర్ధారణగా విప్పి చెప్పుకోలేరు పైకి. సాహసంలేక కాలాన్ని చంపుకుంటారు. అతను ముందు చెబితే చేద్దామని స్త్రీ. అత నేదో నలుపో తెలుపో తేల్చకపోతే, మనం ముందు అంటే ఏంకొంప మునుగుతుందోఅని పురుషుడు ఆగిపోతూ ఉంటారు. నిజానికి వాళ్లకార్యానికి వాళ్ళే ఆటంకం కలిగించుకుంటారు. ఏబరువైనా మోయగలం కాని ఫలోన్ముఖానికి, రాని ప్రేమ బహు భారంగా ఉంటుంది. ఎంతని చెప్పగలం అసలు అనుభవిస్తేనే గాని తెలియదు. అందుకే వాంసేను మా గురువుగారు. "అనుభవమే కాని, వినుసేయు నలవి కాదు, అని ఒక యవ్వనవతి, ఒక యువకుడు కలసి ఆడుకుంటే లేక పాడుకుంటే అది ప్రేమ అని ప్రేమగీతాలు అనిఅంటారు దాన్ని కులాసా అని, విలాసం అనిఎందుకు అనకూడదో సమయానుకూలంగా కిలకిలా నవ్వుకుంటే ప్రేమా, ముద్దు, లెట్టుకుంటే ప్రేమా ప్రతీ కథలోను, ప్రతీ సినీమాలోనూ, ప్రతీ సంభాషణలోను

వచ్చే కాముక ఘట్టాలు ప్రేమా ఎంత సులభంగా తేల్చే శారు ప్రేమకు అర్థం. కిలకిలా నవ్వగలదు కాని ప్రియుని కోసం తలిదండ్రులను విడిచి రాలేదు స్త్రీ! రహస్యం బయట పడితే నేరాన్ని పురుషుడిపై తోస్తుంది స్త్రీ. ప్రేమించిన యువకుడికోసం కాపురం పాడుచేసుకొని భర్తను, బంధువు లను త్యజించలేదు స్త్రీ. రహస్య సంపర్కం కోరుతుంది రహస్యసంభాషణకు ఉబలాట పడుతుంది ఒకవేళ కొందర్ని అలా త్యజించినా అది కేవలం స్వప్రయోజనం కోసం, అంటే తను ఫలానా పురుషునిదగ్గఱ ఎక్కువ సుఖించగలదు స్వేచ్ఛ వుంటుంది అన్నప్పుడే త్యజిస్తుంది. ఇదంతా నాకోసం చేసింది నేను కథానాయకుణ్ని అని భ్రమపడతాడు పురుషుడు. ఒక విషయంలో విసుగెత్తినపుడు ఇంకొక విషయంపై అభిరుచి పోతుంది వాగ్వాదికి, స్త్రీకి అంతే. పురుషుడికి అంతే. ప్రారం భంలో ఈ చాంచల్యం రుచికరంగాను అనుభవ నీయంగాను కనిపించినా అది విషాదాంతం కాకపోదు. మనం కళ్ళారా ఎన్ని నిదర్శనాలు చూడడంలేదు? కాదంటే పోతుందా? ప్రేమ సామాన్యంకాదు సాధారణ మానవాతీతం. ప్రేమకు ఆనం దానికి సంబంధంలేదు. ప్రేమలో ఆనందం కూడా కొంత వున్నప్పటికీ అది ప్రధానంకాదు. త్యాగం దానికి ముఖ్యాం గం. ప్రతి ఫలాపేక్షా శూన్యమైనది త్యాగం. స్త్రీ పురుషుడే అను, పురుషుడూ పురుషుడూ అనూ స్త్రీ, స్త్రీ అను ప్రతి ఫలాపేక్ష లేకుండా ఒకరివల్ల ఒకరికి ఏవిధమైన సుఖము

కోరుకోకుండా అన్యోన్యాభిమానం కలిగి ఉండాలి. అది చాల కష్టం. చెప్పేనుగా సాధారణ మానవాతీతమని. మానవుడు భగవంతుని ప్రార్థించడములోనే స్వార్థం వుంది. నాకు ఆయుస్సు నాకు ఆరోగ్యం, అంటారు లేకపోతే ఏమని ప్రార్థిస్తాడు? రక్షించమంటాడు, కాపాడమంటాడు. మానవునిస్తోత్రం భగవంతునికి కావాలి, లేకపోతే రామకోటి, రామభజనా ఎందుకు ఇతర దేశాల్లో దానికి ప్రత్యేక శాఖ ఉంటుంది. ఆ శాఖోద్యోగులకు పెద్ద జీతాలు ఉంటాయి. వాళ్ళకు అధికారం ఉంటుంది. దేశంలో వసతులు, గౌరవం అన్నీ ఉంటాయి. మానవుడు మనోదౌర్బల్యంచేత భగవద్రక్షణ కోరుకుంటాడు. అది భగవంతుని పని. భగవంతుడు మోక్షం ఐశ్వర్యం ఇచ్చి నరకబాధనుంచి తప్పిస్తాడని ధనికులు మోసంచేత సంపాదించిన ధనాన్ని వేవిధాల పూజలకని, వ్రతాలకని, ఖర్చుచేస్తారు. ఆవిధంగా భగవన్నిమిత్తం అయ్యే డబ్బంతా ఒకపద్ధతిలో తిండిలేని వారికి యిస్తే మరిరెండు సంవత్సరాలలో దేశంలో భిక్షకుడు ఉండడు. దేవాలయాలు, చదువులయాలగా మారిస్తే చెట్లక్రింద వర్షాతప బాధా సమాప్తం కలుగును. బంగారు విగ్రహాలు కరిగి బజారులో అమ్మి ఆసుపత్రులు నెలకొల్పితే పేదవారి రోగములకు నివృత్తి కలుగును. ఒకబిషప్‌కిలేక ఒక అర్చిబిషప్‌కి లేక ఒక పెద్ద పూజారికి యిచ్చిన భూవసతిని సమిష్టి వ్యవసాయం చేసుకుని నూఱుమంది నిరాధారులు కుటుంబసహితంగా

జీవించగలరు. ఒక్క భగవదభిషేకానికి ఖర్చుపెట్టే డబ్బు లెక్కలేనన్ని ఉపయోగకరమైన పుస్తకాలు అచ్చువేయించ వచ్చునేకాని ఎవరుచేస్తారు? ఎవరూ చేయరు. దేశంలో డబ్బులేనివాళ్ళు ఉంటేనేగాని డబ్బు వున్నవారికి విలువ లేదు. సౌఖ్యాలు జరగవు. దేవునికి ఖర్చుపెట్టకపోతే పాపాలు క్షమించి ఐశ్వర్యం యివ్వడనేవిరికి నమ్మకం. యిదే ప్రపంచంలోని భక్తిధర్మం, ప్రేమ, స్వార్థరహితంగా ఎవరు ఎవర్ని ప్రేమించగలరు? సంఘపరిస్థితులు దానికి అనుకూలంగా లేనప్పుడు అది లేదనను కాని చాలా కష్టంఅంటాను అం.

గీ. ప్రబల తాపవిదీర్ణమై బాప్పవారి
పదును నారిన యెద ప్రేమ పాదుకొనును
కర్షునం జీల్చి బోదె నార్గట్టకున్న
నారెటుల నాటుకొనును కేదారమందు.

అన్నారు శాస్త్రీగారు.

లీ: బాగుందన్నయ్యా నాల్గుపాదాలలో పెద్దపెద్ద వృ
కాలు మోస్తున్న బరువు నంతటిని దింపేశారె
ఎవరు ఆశాస్త్రీగారు?

ము: నాల్గు కాదు రెండే. అందులోనూ రెండూ ఉ

మానంకోసం వ్రాసినవే.

లీ: ఔను, ఔను, ఎవరాయన?

ము: ఉన్నారులే. ఆయన చాలా తెలివైన వాగు సుఖ దుఃఖానుభవంగలవారు తరువాత చెబుతాను మళ్ళీ అదొక ఉపకథ అవుతుంది ఇప్పుడు.

ము: సరే కొంతకాలానికి ప్రభాకర్రావు తల్లి, మేస్త్రీటు గారి యింటికి వెళ్ళినమీదట. రాధతల్లి మరొక మారు పీరింటికి రావడం తటస్థపడింది.

లీ: ఓహో కథేనా, ఇంకా ప్రేమోపన్యాసమేమో అనుకున్నాను. ఉ, సరే, రాధా వాళ్ళు మళ్లీ ప్రభాకరం యింటికి వచ్చేరంటావా ఆదొరగారు ఇంటిదగ్గరే ఉన్నారా?

ము: ఉన్నాడు ఉన్నాడు. ఇంటిదగ్గఱే తనగదిలో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నారు.

లీ: కారణం యేమిటో ఎప్పుడూ యింటిదగ్గఱ వుండని వాడు, ఉండడానికి? కొంచెం బుద్ధి చలించిందా?

ము: కాదు, కాదు, యేదైనా వ్రాయవలసి వచ్చినపుడు బయట స్నేహితుల రాపిడి ఎక్కువని యింటిదగ్గఱే వ్రాస్తూ ఉంటాడు.

లీ: అలాగా, రాధ, ఈ అవకాశాన్ని వినియోగించుకుంటుందనుకుంటాను, వారు వెళ్ళంగానే ప్రభాకర్రావు తల్లి వార్ని దొడ్లోకి తీసుకువెళ్ళి ఆమొక్కా

ఈ ముక్కా చూపిస్తూ ఖాతాఖాని కొడుతూ ఉంటుంది. ఇదే అదునని ఏదో నెపాన్ని చెప్పలేం. అనేక నెపాలు ఉంటాయి మీ ఆడవాళ్ళకు. అతను గదివైపు వచ్చి, యేదో వ్రాస్తున్నారు అని అనేసింది రాధ అతిసాహసంతో. అదైనా పూర్వపరిచయం ఉందికనుక. అంటే లీల నవ్వింది.

ము: ఏం? నవ్వావు?

లీ: యేమీ లేదు ఆడవాళ్లు అంటే అంత లోకువ యెందుకో నీకని?

ము: లోకువ యేమిటి? వున్నమాట కులుకెందుకు అని మళ్ళీ కథాప్రారంభం చేసేడు.

పరిభాకరం తలపైకెత్తి ఓహో రాధా ...! అని పిలిచాడు.

రాధ కొంచెం దగ్గరగా వచ్చి నిలుచుని ఏమిటి రాస్తున్నారు అంది.

ప్ర: చూడు.

అంటే చూడ్డానికన్నట్టు తలను అతని తలకు తగిలించి వంగి చూస్తూంది.

ఆమె వక్షానికి అతనిచేతికి యెంతో యెడంలేదు. రాధ మహాచూస్తోన్నట్టు నటిస్తూందేకాని యే అవయవాలకు తాకుతున్నవో అలా జరక్కపోతే అవి సంభవించడ మెల్లాగా అనిదానికి తగినట్టు Adjustment చేస్తోంది. దాని

కతడు కొంత సాయపడి ఏం తెలిసిందా? అన్నాడు చేతిని ఆమె వక్షానికి వత్తుతూ. ఆమె వాత్తిడి గుర్తించనట్టు దస్తూరీ తెలియడంలేదు. ,,అదేం రాత గొలికేసుకుంటారేంటి" అంది, అంతట్లో ఎవరైనా వస్తూన్నారేమోనని భయపడి గుమ్మందగ్గరకెళ్ళి తొంగి చూసింది. వాళ్ళకా గొడవేలేదు. కాలం మళ్ళినవాళ్ళకు కబుర్లపై అభిలాష మెండు. వాళ్ళూ ఒకప్పుడివన్నీ పడ్డా బాధలే అయినా కాలక్రమాన్ని మరచి పోతారు. సరే రాధ మళ్ళీ కొంచెంలోపలికివచ్చి, అదేమిటండీ'?

ప్రి: అది ఒకకథ. పత్రికకు పంపిచాలి

రాధ: ఏ పత్రికకు?

ప్రి: భారతికి.

రాధ: .ఆకథ పేరేమిట'ని మహా శ్రీద్ధగా చూడ్డానికన్నట్లు దగ్గరకు వచ్చి యధాప్రకారం స్పర్శా భాగ్యా యిస్తోంటే యెంతకాలం వూరుకుంటాడు మగవాడు అందులోనూ మాలపిల్లి మరిగినసుక్క పరిభాకరం. సరే చెయ్యి పట్టుకొని ఆమాంతంగా అంతమనిషిని కాళ్ళల్లో కూర్చోబెట్టుకొని ముద్దు పెట్టుకున్నాడు. రాధ పరిపూర్ణంగా పరవశత్వం పొందింది. లోకం లోని సౌఖ్యాని కంతటికీ తను అధికారిననుకొంది. పరిపూర్ణ తృప్తితో సిగ్గుతో, ముసిముసి నవ్వుల తో గుమ్మందగ్గరకు వచ్చి ఎవరూ రాకపోవడంచూసి 'ఎవరన్నా వస్తేనోండి? మంచివారే' అంది.

ప్రి: యెవరూ రాలేదుగా.

రా: రాలేదు. వచ్చినా అంతేనా! అని ఒక తెలివైన భార్య భర్తను మందలించినట్టు చెప్పింది.

రా: ఆకథ నాకర్థం కావడంలే. దస్తూరీ బాగుంటే చదువుదును.

ప్రి: నిజమే నాదస్తూరీ బాగుండదు. అదే లేకపోయింది మనకి. పోనీ నువ్వు వ్రాసి పెడుతూండకూడదూ నాకు కథలు?

రా: ఆకథ చదివి వినిపిస్తే వ్రాసిపెడతాను.

ప్రి: ఇక్కడెట్లా?

రా: మరెక్కడ అంది నవ్వుతూ.

ప్రి: రాత్రి 10 దాటేక మా Roomకు రా.

రా: మీ Room Cenema కు యెదురుగుండా కాదూ? అక్కడెవ్వరైనా వుంటారు బాబు?

ప్రి: యెవ్వరూ వుండరు.

రా: మరి కథ చదివి వినిపిస్తారా?

ప్రి: ఆహా. తప్పక కథ వినిపించడం యేమిటి. నువ్వొస్తే కవిలోకానికొక నూతనకథ భిక్ష పెట్టేమన్నమాటే. అంటే రాధ నవ్వింది.

ప్రి: తప్పక వస్తావా మరి?

రా: అవునని తలవూపింది.

ప్రి: వొట్టేసుకోవాలి అంటే రాధ తక్కుతూ తారుతూ

చేతులో చెయ్యి వేసింది. ప్రభాకరావు ఆ అవకా శాన్ని వినియోగించుకొని దగ్గరగాలాక్కొని రెండు బుగ్గలూ సున్నితంగా గిల్లేడు. సరసాలకు సార్వభౌముడు. అంతట్లో ఎవరో వస్తూన్నట్టు శబ్దం కాగా బైటకుపోయి రాధ వారి సంభాషణంలో యేకీభవించి మహా వుషారుగా యుద్ధం గెలిచి బిరుదులు పొందబోయే సేనానివలె ఆనంద సాగరంలో సంతృప్తి నావలో ప్రయాణం చేస్తోంది. ఆసాగరం లోనే అనేక నిందా తుపానులు సంతస సముద్రయా నాని కాటంకం కలిగిస్తాయని తెలియదు. అననుభవాలోచనతో ఆశాసౌధాలు నిర్మిస్తోంది. అవి నిరాశా పథాలలో కూలిపోతాయని యెరుగదు. పాపము, చిన్నతనం, చల్లగా గాలి తగులుతోందని ఆరబైట పండుకొంటుందేగాని మంచువల్ల జ్వరం వస్తుందని తెలుసుకోలేక కవీ నేను పరస్పర ప్రేమబద్ధులమనేకాని కాలంలోని మార్పు కనిపెట్ట లేదు. రుచి— అజీర్ణము; ప్రేమ— వియోగము, సంబంధము— విరోధము వీటికున్న పరస్పర క్రమం తెలియదు. ఏలా అయితేనేమి కొంతసేపట్లోకి రాధ వాళ్ళ తల్లియింటికి చేరుకొన్నారు. ఆసమయానికి నీళ్ళు మరగ్గా లీల టీ మిక్సుచేసి ముకుందరావుకిచ్చి తనూ బలవంతంచేత త్రాగుతూ 'అన్నయ్యా నీమూ

లా:న్నీ నాకు టీ అలవాటవుతోంది" అని నవ్వింది.

ము: నామూలాన్ని అందరికీ దురలవాట్లే అబ్బుతాయి మరి

లీ: లేదు అన్నయ్యా నీమూలాన్ని నాకూ నాలాంటివాళ్ళకూ అందుబాట్లో లేని అనేకవిషయాలను వాటితో పాటు నీవ్రువాసిన కమ్మని కథను ఆలకిస్తూ కొంచెం కొంచెం జ్ఞానపరిభోధం కలుగుతున్నట్టు భావించుకుంటున్నాను. నీదయవుంటే రేపటినుంచి ఇంగ్లీషు ప్రారంభించి నేర్చుకుంటాను.

ము: అటువంటి విద్యాభిలాష వుందంటే మా చెల్లాయికి రేపే ఇంగ్లీషు ప్రారంభిస్తాను.

యీలా కొంతసేపు కబుర్లయిపోయేక కథా ప్రారంభం అయింది.

లీ: అన్నయ్యా! ఆఖరుకు రాధ ప్రభాకరం గదికి వెళ్ళిందంటావా?

ము: వెళ్ళకేం, ఆ రాత్రి 10, 11 గంటలుదాక తన గదిలో అటూ ఇటూ పచారు చేస్తోంది. అది సీతాకాలం కనక వాళ్ళమ్మా నాన్నగారు, తదితరులు యెవరి గదుల్లో వారు తలుపులు వేసుకొని పండుకున్నారు. రాధకు చాల తొందరగా వుంది. నిద్రాదేవత సుకుమారహస్తాల్లో హాయి ననుభవిస్తోంది వూరు వూరంతా, నిజం చెప్పాలంటే చెల్లాయి వెయ్యిమంది శ్రీయోభిలాషులు కలసి చేకూర్చలేని

దుఃఖోపశమనం నిద్రాదేవత చేకూరుస్తుంది. హృదయావేదన శరీరబాధ మొదలైనవన్నీ ఆమె కడుపులో పెట్టుకొంటుంది. ఎడబాటు సహింపలేని నూతన వధూవరులు కూడా ఏకశయ్యాగతులైనప్పటికీ పరస్పర విస్మృతి కలుగుతుందామెవల్ల. వేదాంతం గోలపెట్టి చెప్పే సుఖదుఃఖ రాహిత్యం ఒక్క నిద్రాదేవతవల్లనే కలుగుతుంది కాని మరియికదేనివల్ల కలుగదు Science తెలిసినవారు నిద్ర, రెస్టు అని నరాలు కండరాలు, విశ్రాంతి పొంది నూతన కార్యోన్ముఖ క్రమానికి శక్తిని పొందుతాయని చెప్తారు రోగికి నిద్రపట్టిందా లేదాయని డాక్టరు నొక్కి నొక్కి అడుగుతాడు. నిద్ర ఆరోగ్య సూచకం కనక. కలత లేని నిద్ర కలిగితే అంతకన్న కావలసిందేముంది. అందుకే క్రిష్ణశాస్త్రి "సుఖము, దుఃఖము లేని సుషుప్తిలోన" అని రాశారు. సరే మన రాధ మన్మథ బాణార్భాటం చేత బాధ పడుతోంది కనుక నిద్రాదేవతకు ప్రయత్నించినా ప్రవేశం దొరకలేదామెకో. గడియారం చూసింది 11–15 అయింది. కాలంపై విసుపు పుట్టింది. కానికాలం బహు శాంతమూర్తి. విసుక్కున్నా మెచ్చుకున్నా దూషణ భూషణ దూరంగా తన క్రమాన్ని నిర్వర్తించుకోగలదు. నిష్పాక్షికంగా విద్యుక్త ధర్మాన్ని నెరవే

ర్వేది ఒక్క కాలం మాత్రమే. సూర్యచంద్రాదులు కూడా ఆ బోధ రాటంకంచేత విధి నిర్వర్తింపలేక పోవచ్చుకాని ప్రళయం వాటిల్లినా కాలగమనానికి అడ్డు రాదు. అది చీకటిరాత్రి చంద్రుడు పూర్తి విశ్రాంతి తీర్చుకుంటున్నాడు. వుదయాస్తమయం పని చెయ్యాలి సూర్యుడు. అబ్బే చంద్రుడల్లా కాదే రెండుపక్షాల్లోనూ 1–2 రోజులు మాత్రం పూర్తిగా వుండి తతిమ్మా రోజుల్లో తన ఇష్టం వచ్చినట్టే సంచరిస్తాడు. లోకంలో ఏ వుద్యోగస్తుడికీ లేదింత విశ్రాంతి. అతడి కన్నింటిలోనూ ఆలాంటి అదృష్టమే కలిగింది, గొప్పవాడు. 4 సంవత్సరాలు విద్యాభ్యాసం సాగించాడో లేదో బృహస్పతీ సతీ సహితంగా సంపాదించేశాడు సర్వవిద్యలూను. మనం దోషి హింటే అతనికి లెక్కేమిటి, పాపి అంటే లెక్కేమిటి! చూడు ఒక అరగంట తనకాంతుల్ని విరజిమ్మితే మందపవనుడు ఖంగారెత్తి అటూ ఇటూ కదులుతాడు. చంద్రుణ్ణి చూస్తూ యీ పవనస్పర్శపొందే ప్రతివ్యక్తి ప్రాయంతో నిమిత్తం లేకుండా ఆశాంతరితాలులో అల్లాడిపోతాడు. ఆరబైలు స్థలంలో ప్రేమికులు గీతాలు పాడుకుంటూ, సరస సల్లాపాలతో కాలక్షేపం చేస్తారు. వాళ్ళందర్నీ చూస్తూ హాయిగా చల్లగా మానవదుర్లభ పదాల్లోవి

పాండురచ్ఛాయతో తారాలాంకృతంగా విహారిస్తాడు. అది అతని పని. ఎంత చక్కని ఉద్యోగమో చూశావా, అంటే లీలావతి నవ్వింది. సరే చంద్రాతపోద్రేకితం కాకపోయినా రాధాతాపం అనివార్యంగానే ఉంది. అతికష్టంమీద 15 నిమిషములు గడిపింది. వెళ్లడానికే నిశ్చయించుకుంది, కొన్ని బిస్కెట్లు కూడా పట్టుకుంది కానుక ప్రియునికి. అది యవ్వనం యేదిచూస్తే అది తినాలని, యేది తోస్తే అది చెయ్యాలని వుండే రోజులవి. ప్రకృతి సహజమైన అభిలాషలకు అందరూ లొంగుతారు. కొడుక్కి పెండ్లి అయిందా! తబ్బిబ్బయ్యే తల్లి కోడలొచ్చేక దానితో కలహిస్తుంది. తల్లి దైవమనుకొనే కొడుకు అత్తాకోడళ్ళ తుణ తుణ గంద్రగోళాల్లో కొంచెం కోడలి పక్షంగా వుంటాడు. అత్తగారి అధికారాన్ని అంగీకరించని కోడలే మళ్లీ తన కోడలుపై మండి పడుతుంది. కోడల్ని తృణీకరిస్తుంది. ఆ విధంగా పరిస్థితిని బట్టి వుంటుంది ప్రతీదీని. నెమ్మదిగా దొడ్డితలుపు తీసుకొని ప్రభాకరావు గదివైపు శంకితమానసంతో వేగంగా వెళ్ళింది. గదిదగ్గర నిలుచుని కిటికీ లోంచి చూచింది. అతను పుస్తకం చదువుతూ రిష్టు చూస్తున్నాడు మాటి మాటికీ. తన రాకనే నిరీక్షిస్తున్నాడని మహానందంతో తలుపు తీసుకొని లోప

లికి ప్రవేసిస్తుంది. నూతనం, యేం చెయ్యాలో తెలియదు.

ప్రి: "రాధా Coman Sitdown," అన్నాడు. (ఆనందం గావున్నప్పుడు ఇంగ్లీషు వస్తుందిలే.) రాధ ప్రక్క కుర్చీలో కూర్చుని గది తిలకిస్తోంది. కవుల, దేశనాయకుల ఫోటోలతో వుంది గది అంతా. ఒక బీరువా దానిసిండా పుస్తకాలు, ఒక కేంపు కాటు దరుపు దాని పైని తెల్లని దుప్పటీ. ఆశ్చర్యపోయింది. Simple గానూం, గౌరవంగాను కనుపించిందామెకు.

ప్రి: యేం ఇంత లేటు?

రా: అందరూ పండుకోవద్దా?

ప్రి: జాగ్రత్తగా మేనేజ్ చేసేవా?

రా: సాధ్యమైనంతవరకూ.

యీ విధంగా సంభాషణలోకి దింపేడే కాని తొందర పడలేదు. వంటయింట్లో ఇందేశేషాతుందనో యేంటో

ప్రి: ఆ పొట్లాం యేమిటి?

రా: ఓ మర్చిపోయాను మాటల్లో బిస్కట్సు మీకోసమే తీసుకోండి. "ThanK you టిఫిను కూడా తెచ్చావన్నమాట," అని ఒక్క బిస్కట్టు కొరికి రాధకందీయగా ఆమె మొదట వద్దని తరువాత స్వీకరించింది.

ప్రి: ఇలారా! మంచంమీద కూర్చో, అంటే రాధ తలుపు

గడియవేసి మంచంమీద అతిసిగ్గుతో నసికి నసికి కూర్చుంది. అవును సిగ్గుకొంచెం కోరికకు అడ్డు తగు లుతుంది. లేకపోతే కొంపలు మునిగిపోను. యీ పాటికి. మంచంమీద కూర్చున్న మనిషిని దగ్గరకు లాక్కొని తన హస్తాల్ని ఆమె వక్షస్థలాన్ని వివిధ విధాల విహారం చేయిస్తున్నాడు. అని చెపుతూ లీల కొంచెం యేదో బాధచేత సమంగా ఆలకించలేకపో తోందని ఎంత చెల్లాయయినా స్త్రీ అనీ ఆవుచేశాడా వర్ణన ముకుందరావు. లేకపోతే మనంకూడా విం దుము లీలావతి మూలాన్నిగాని.

ము: ఆవర్ణనకేంగాని చెల్లాయి, ప్రభాకరం యిలా మా ట్లాడేడు రాధతో.

ప్ర: రాధా నిన్ను ఒక ప్రశ్న వేస్తాను.

రా: యేమిటో అంది నవ్వుతూ.

ప్ర: యీరాత్రివేళ ఇంత సాహసంగా నాదగ్గర కెందు కొచ్చేవు?

రా: కథ చెపుతానన్నారుగా అంది ఫక్కున నవ్వి. ఆ నవ్వులోనే ఉంది భాషంతాను. కేవలమూ మాట ల్లోను రాతలేనా భాష, నవ్వులు సౌంజ్ఞ ముఖపద్ధ తులూ యేరచనా వెల్లడించలేని భావాలు వెల్లడి స్తాయి. భాషంటే మన భావాన్ని యెదుటవారికి తెలియజేసే సాధనం. ఒక్కొక్కసారి భాష మనో

భావేశరంగా వుండొచ్చు. అప్పుడు ముఖ లక్షణాలునుబట్టి ఆమనిషిని మనము యెక్కువ అర్థం చేసుకోగలం. ముఖలక్షణాలనుబట్టి భాష యేరూపంలోయున్నా మన స్తత్వాన్ని గ్రహించడమే Psychology అంటారు.

లీ: అవును అవి యదార్థమే.

ము: తరువాత ఆరాత్రి ప్రభాకరం వుపాధ్యాయుడై విద్యార్థినైన రాధకు కామశాస్త్ర ప్రత్యక్షర భావం ప్రత్యక్షంగా కరపి కరువు తీర్చాడు.అంతే లీల సిగ్గున తలవంచుకొని నవ్వింది.

లీ: మంచివాడవే అన్నయ్యా చాల్లే కథ చెపుదూ.

ము: యిదంతా కథలోనిదే.

లీ: ఇది కథ కాదని యదార్థమని చెప్పేవు. వాళ్ళిద్దరి యేకాంత సంభాషణా శృంగార చేష్టలూ ఇవన్నీనీ కవిచాతుర్యము కాకపోతే కళ్లారా చూశావా యేమిటి?

ము: కవితాచాతుర్యముకాదు ప్రత్యక్షర ప్రామాణికం.

లీ: ఆఁ ఊరుకో, అవన్నీ నీకెలా తెలుసు?

ము: ఎల్లా తెలుసునంటావా చెప్తానులే తరువాత. సరే తెల్లవారుఝాము మూడున్నరయింది.

ప్ర: రాధా 3½ మూడున్నర అయింది యింటికి పోతావా?

రా: అబ్బా అప్పుడే 3½ మూడున్నర! కాలదేవతకు

కంగారెక్కువ సుమండీ.;

ప్రి: అవును కొంచెం కంగా రెక్కువే నీకుమల్లే ఆమెకూ ఒకప్రియుడు వుంటే అంత కంగారుండకపోను అంటే రాధ నవ్వి లేచి దీర్ఘ శృంగార కార్యాకలాపకారణం చేత చెదిరిన దుస్తులూ తలా సవరించుకుంటూనే సంభాషణ సాగించింది. కాలాన్ని కదలకుండా బంధించును రాధ వీలుంటే.

రా: నాకు భయమండీ మీరూ రారూ?

ప్రి: ఇప్పుడు భయమేమిటి వచ్చేటప్పుడు లేదుగాని అని బుగ్గపట్టుకున్నాడు. ఇంకా తనివి తీరలేదు. ఎదురుగుండా వున్నంతసేపూ ఆలాగు వుంటుంది.

రా: పోనీలెండి నాదారిని నన్ను పొమ్మంటున్నారుకాదూ అని చనువుగా దగ్గరకు వచ్చింది. అతడామెను ఎత్తి ముద్దెట్టుకొని "సరే పద" అనికూడా వెళ్ళాడు యింటివరకూ. 'యిక పోతానుమరి' అని ప్రియురాలి చేతిని గిల్లాడు ప్రభాకరావు. ఆమె దానికి ప్రతిక్రియ చేసి అల్లాగే నిలుచుంది. అప్పటి ఆమె ముఖవైఖరి ప్రభాకరాన్ని ఒకప్రశ్న (కోరిక) అర్థించింది అది గ్రహించి.

ప్రి: రేపుకూడా రా.

రా: రేపూనా! (నవ్వుతూ) యివ్వాళకుమల్లే దేబెట్టనంటారేమో?

ప్రి: భయంలేదులే. అని యింటికి వెళ్ళిపోయాడు. చూశావా చెల్లాయి రాధ భాష లేకుండానే ముఖ వైఖరి చేతనే ప్రిభాకరాన్ని పురికొల్పి ప్రశ్న వేయించుకొని మనోభీష్టాన్ని పొందింది. Faciology ముందు భాషెందుకు పనికొస్తుంది.

లీ: వాళ్ళ వాళ్ళెవ్వరూ చూడలేదుకదా రాధను?

ము: యెవ్వరూ చూడలేదు. నువ్వు స్త్రీవి కనుక అడుగ వలసిన ప్రిశ్న అడిగావు. స్త్రీలకు భయోత్పాతము హెచ్చు. ఎన్ని వేషాలువేశ్నీ యెవరికి తెలియకుండా చూచుకోవడం ముఖ్యం ఏమంటావు.

లీ: అవును నిజమే?

మరునాడు రాధ లేచేటప్పటికి యెనిమిది ముప్పై అయింది. గారాలపట్టి పని చెయ్యాలని పాటు చెయ్యాలనీ లేదు. ముఖం కడుక్కొని స్నానాల గదిలో ప్రివేసించి స్నానం చేస్తూ గత రాత్రి ప్రిణయ రంగస్థలంలో తన అవయవాయుధాలు ప్రితిపక్షిపై యే విధంగా ప్రియోగింప బడ్డాయో ప్రితిపక్షి గంభీర ప్రిణయ సంగర చాతుర్యాన్ని తనెలా తట్టుకోగలిగిందో జ్ఞప్తికి తెచ్చుకొని తత్సంగ రసంక్షుభితశరీరాలో కనామైకంలో మునిగి స్నానం పూర్తి చెయ్యాలంటే గంట అవుతుందా గంటన్నరౌ తుందా! కాఫీ చల్లారిపోతోందే అమ్మడూ అని

వాళ్లమ్మ గారాబంగా పిలువగా లేచి తయారై కాఫీ తాగింది. ప్రతీపనిలో తలంపులో ప్రభాకర సహచర్యా న్నభిలషిస్తోంది మానసం. మనస్సు మంచి స్వాతంత్ర్యం కలదీ స్వేచ్ఛావిహారి, పరులకందనిది.

లీ: మరునాడు కూడా వెళ్ళిందా యేమిటన్నయ్యా?

ము: వెళ్ళకేం చేస్తుంది అలవాటుపడిన తరువాత.

లీ: ఐతే ఇలా ఎంతకాలం సాగుతుంది రంకుదాగదంటారే?

ము: యెవరన్నారు దాగదని?

లీ: అదేమిటన్నయ్యా అది లోకవిదితం.

ము: కాదు కాదు ఇలాంటివి తెలివితక్కువ వల్ల తెలుస్తాయి. తెలిసింతరువాత రంకు దాగదంటాము మనం. తెలియనివాళ్లాగు తెలియవు వాటి విషయంలో చర్చ వుండదు. తెలియనప్పుడు వాటివిషయంలో విమర్శ యేలాగుంటుంది కొన్ని లేనివీ పుడతాయి ఒక స్త్రీ ఒక పురుషుడూ మాట్లాడుకొంటే (యువతీ యువకులు) వృథాగా ప్రజ లనుమానిస్తారు. అసలే మీా గంతదు.

లీ: అవును. అదినిజమే. వృథానుమానాలూ వుంటాయి లేందే వుందంటారు.

ము: అవును లేంది వుందనుకోవచ్చు కొన్ని వున్నవి తెలియకపోనూవచ్చు ఆభయం వుభయులకూ వున్నక్రియాటంకం కలిగించలేదు. సాధ్యమయినంతె జాగ్రత్తగా

వుంటారంతే. ఒకసారి నేను హరికథకు వెళ్ళేను. అక్కడ ఒక స్నేహితుని యిల్లుంది. అతడు అరుగు మీద కూర్చున్నాడు. నేనూ మరి కొందరు మిత్రులూ యెదురుగుండా వున్న అరుగుమీద కూర్చున్నాము. ఆ అబ్బాయి మాక్లబ్బులో మెంబరు వారింట్లో యింకెవ్వరూ లేరు. అంతా బైట కథా శ్రవణంలో వున్నారు. ఒక చక్కని మనిషి యిరువది ఐదేండ్లుంటాయి లోపలికి వెళ్ళింది. ఆవిడ వెనకాల అతడూ వెళ్ళేడు. ఆ అబ్బాయి నాకు స్నేహితుడే పగలంతా క్లబ్బులో మాట్లాడుకుంటూనే వుంటాం. పెద్దకుటుంబీకుడు, చదువుకున్నవాడు, చక్కగా వుంటాడులే. వుండలేక నేను "ఏదో ఛాన్సు తగిలిందోయి మనవాడికి" అన్నాను. నాపక్కవాడు అవునని తల వూపి నా వూహను బలపర్చేడు. యేమైతేనేం అది అతనిదాకా వెళ్ళి అతడు బాధ పడ్డాడు. ఆ మరునాడు వచ్చి "ఏమండీ ముకుందంగారూ మీతో మాట్లాడాలి మీరు సాయంత్రం వస్తారు కదూ" అన్నాడు. నేనిదంతా మర్చిపోయి 'ఏం ఎందుక'న్నాను "సాయంత్రం చెప్తాన"న్నాడు. తరువాత నా మాటల కతడు నొచ్చుకున్నాడనీ, ఆ లోపలికి వెళ్ళినది అతని పిన్ననీ తెలిసింది. నాకు నేను చాలా విచారించాను. సాయంత్రం క్లబ్బుకు

వెళ్ళి అతన్ని పిలిచి "ఏమిటి మాట్లాడాలన్నారు". అని అడిగాను. 'అబ్బే యేమీ లేదని దీనంగా పెట్టేడు మొఖం. కళ్ళుబ్బకళ్ళంతా పాకిపోతోంది ఈగోడవతో. సరే అడిగితే సమాధానం చెప్పవచ్చునని నే నూరుకున్నాను.

లీ: ఏమని చెపుదు వేంటి?

ము: ఏమనేమిటి మేము హాస్యాలాడుకొనేవాళ్ళం ఆ అమ్మాయి వాళ్ళ పిన్నని తెలియక పోవడంచేత అన్నాను. అలాంటి హాస్యసంభాషణలోకి దిగరాదు కాని, దిగేక యిలాంటివే వస్తూంటాయి. 'నేను మా యింటిదగ్గర అలాంటి పరిస్థితులలో ఇంకోమని పిత్రో లోపలికి వెళ్ళు తేమీంరూ అందుకూ ఆ మాట ఏమంటే మనకు అలవాటైపోయింది. అప్పుడు నేను కష్టపెట్టుకోనా మరి ఉద్దేశపూర్వకంగా అన్న దేమీ లేదు. మీరు నిజంగా వ్యభిచరిస్తున్నారనీ కాదూ ఆమె మీ పిన్నని నాకు తెలియనూ తెలియదు. వేళాకోళంకోసమంటే విషమించింది. మీరేమీ అను కోకూడదు మరి'' అందామని.

లీ: కావుంది అలవాటులో అప్పుడప్పుడు పొరపాటు వొస్తుంటాయి! అతడడిగాడా?

ము: లేదు అతను తెలివైనవాడు. తరువాత అంతా చెప్పేరు. 'వూరికే జోక్ కోసం అన్నాడుగాని ముకుం

ఆలా అనకు నెవరినీ' అని దానిమీదట తానాగో
డవ ఆపుచేశానని ఒక స్లిప్పుమీద వ్రాసి ఇచ్చాడు
నాకు. మళ్ళీ ఇందరం కలసి ద్విగుణీకృతాభిమా
నంతో విటరేచరు ఆడుకొన్నాము.

లీ: అయినా రోజూ ఈలాగే ఎవరికంటా బడకుండా వెళ్ళు
తుండేదన్న మాట రాధ.

ము: వెళ్ళింది కాని ఎన్నాళ్ళు వెళ్ళింది. అనుదినం వెళ్ళక
పోయినా అనుకూలతనుబట్టి రెండు మూడు నెలలు
దాకా వెళ్ళింది జయప్రదంగా. ఒకనాటిరాత్రి రాధ
ప్రభాకరంతో యీలా చెప్పింది.

రా: ఏమండీ క్రమం తప్పి పదిరోజులయింది. మాఅమ్మ
కూడా అంటోంది ఏం చెప్మా అని కొంప మునిగిందో
ఏంటో చాలా భయంగా వుందండి.

ప్ర: ఏం భయంలేదు అదే వస్తుంది. ఒక్కొక్కప్పుడలా
లేటు అవుతోంది

రా: కాదండీ నీరసంగా వుంది అన్నం సహించడంలేదు.
హితవు చేసుకుతింటే వాంతై పోతూంది. నామనస్సు
మనస్సులో లేదు నిరాధారం. అని ప్రభాకరం
వొళ్ళో తలబెట్టుకొని ఏడుస్తోంది.

లీ: అంతపనీ జరిగిందన్నమాట ప్రమాదమే పెండ్లిలేందే

ము: జరక్క మానుతుందా?

లీ: అయితే ఏంచేసేడూ? నాకేం తెలియదన్నాడా

ప్రభాకరం?

ము: అబ్బే ఆలా అనలే. ఆతడలాంటివాడు కాడు. ఎందు కలా ఏడుస్తావు నేనున్నానుగా నీకేం భయంలేదు. నీకొక వుపాయం చెప్తాను చూడు లే. అని రాధను లేవదీసి కూర్చోబెట్టేడు.

రా: ఏం యేదైనా మందు వేస్తారా?

లీ: ఆలాంటివాటికి మందులుకూడా వుంటాయా ఏంటి అన్నయ్యా? ఛీ విధవబ్రతుకు. పిండనాశనం చేస్తాం దా? శిశుహత్య అన్నమాట.

ము: ఏంతప్పు చెల్లాయి చిన్నదానవు నీకేమీ తెలియదు. పరిస్థితికి ఎంత ప్రాధాన్యం వుందో తెలుసునా తల్లి చేత పిల్లకు విషం పెట్టిస్తుంది. అంతకన్నా దారుణ మేముంది.

లీ: ఆదేమిటి ఏతల్లి పిల్లకు విషం పెడుతుంది. యెక్క డన్నా వుందా? జంతువులు చేయవాపని.

ము: జంతువులు చేయవు జంతువులకు స్వేఛ్ఛ స్వాతంత్రి యం వున్నాయి మానవులేం చేస్తారు? నియమాలూ కట్టుబాట్లూ ఆచారాలూ యథేచ్ఛను హరిస్తాయి. యథేచ్ఛా ప్రేరితమై ఒకస్త్రీ పరపురుషసాంగత్యం కోరుతుంది. ఆదృశ్యం తనబిడ్డ కంట బడుతుంది. వాడు దాన్ని తండ్రికి చెప్తాడని తల్లి వాన్ని చంపు తుంది. ఇచ్ఛనియమోల్లంఘనం చేసింది. భయం

పుత్రివాత్సల్యాన్ని రూపుమాపింది. ఏమంటావు చెల్లాయీ యిదంతా పరిస్థితి. ఇటువంటివెన్నో వున్నాయి లోకంలో. చిన్నదానివి. పుస్తకజ్ఞానమే గాని, అనుభవప్రాప్తమయిన విజ్ఞానంలేదు. విజ్ఞాన నేత్రంతో విమర్శిస్తే ఆర్థికదుస్థితులు, అసమానత్వం మానవులను అనేక దురలవాట్లకు ప్రేరేపిస్తాయి. ఏతప్పుకయినా వెనుక పరిస్థితి కారణమై ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అధిక ధనసంపన్నతచేత అవకాశా లు కలిగి మానవుడు కావలసిందానికన్న ఎక్కువ పొందడానికి ప్రయత్నించడంలోకూడా కొన్ని సాంఘిక దురాచారాలు పుడతాయి!

వ్యభిచారం తప్పు అయినప్పటికీ అనేకమంది ఆ పనిని చేస్తూనే వున్నారు. పోనీ పౌరాణికంగా చూసుకుందామంటే తార ఆమె భర్త బృహస్పతి గురుదేవుడు. వేదశాస్త్ర పురాణాది సర్వధర్మోప దేశ గ్రంథాలు తన నోటి వాక్కులూ దేవేంద్రుడు కూడా తనకు శిష్యుడూ, శిష్యబృంద పరివేష్టితుడు. యజ్ఞయాగాది సర్వపుణ్య కార్యాకలాపధురీణుడు. అతని భార్య తార ఎందుకు తృప్తి పడలేదు? ఎందుకు వ్యభిచరించింది? నవయవ్వనవతి శృంగారచేష్టాభి లాషిణి పొంగి పొర్లి వచ్చే నవయవ్వన మదంలో వున్న రాధను తదనుగుణ్యంగా పుణ్యకార్యానిమగ్నుడు

అయిన భర్తపై విసుపు రాదా? అది యవ్వన సహజమైన కాంక్ష. దాన్ని కాదనడానికి వీలులేదు. భర్తకు భక్తి కావాలి భార్యకు రక్తి కావాలి. పతికి మోక్షధనం కావాలి. సతికి యవ్వనధనం కావాలి ఏంచేస్తుంది? మనస్సులో పుట్టే తీరని కోరికనెవరరికట్టగలరు. తమ ఇంట్లో చనువుగా చురుగ్గా చదువుకుంటూన్న చంద్రుడు నవమన్మధుడు. మొగ్గువాలని ప్రథమ యవ్వనం అందాలు చిలికే ముఖం కోరికలు పుట్టించే చేష్టలు. ఒక్కవైపున ఆకలి అమితంగా వేస్తూంది. అక్కడే అందుబాటులో చక్కని మామిడిపండ్లున్నాయి తీసుకు తినరాదా? తింటే తప్పా? సహజంగా దాన్ని తార అభిలషించింది. తప్పనో, గురుద్రోహమనో, రుచి తెలియకో, అతడు నిరాకరించేడు. తప్పూలేదు, ఒప్పూలేదు, వూరుకోమ్మని వుద్దిష్ట ధర్మాలన్నీ ఖండించి ఆ ధర్మాలు కారాగృహ కవాటాలని చెప్పి మెప్పించి, తృప్తి తీర్చుకుంది. తప్పని లోకమంతా అపహాస్యం చేయగలరేగాని యవ్వనాన్ని వృద్ధాప్యం ఏలా తృప్తిపరుస్తుందని అనుకోలేరా? అటువంటివి తెలియకుండా చేస్తారు. తెలిస్తే తెగిస్తారు. తెలిసిందాకా భయం. తెలిశాక తెగింపూను. భార్య వ్యభిచరించడం సహజం వృద్ధాప్యంలో భార్యను కోరడం తప్పు. తలకుమాలిన పని

హిమాలయాన్ని ఎక్కడానికి ప్రయత్నించడం, చిత్రాంగి సారంగధరుని కోరడంలో ఏమీ తప్పులేదు కొడుక్కి నిశ్చయించి అందానికి ముచ్చిపోయి, తనే పెండ్లాడ్డం తప్పు. ముసలివాడే అందానికి ముగ్ధుడై పోతే, ఏం మంచి పడుచుదనంలో వున్నదానికి కాంక్ష వుండదా? అధికారం చేతిలో వున్నదని శిక్ష విధిస్తాడా? యీ వెర్రి సారంగధరు డేమిటి? తనకోసం నిశ్చితమైన రూపవతిని భ్రమతి తండ్రి పెండ్లి చేసుకున్నాడని చెప్పినా వినకుండా తిరస్కరించాడు. ఆకలి వేస్తోందంటే భోజనాలయిపోయినాయన్నారన్నాడు. దాహం వేస్తోందంటే మంచినీళ్లు లేవన్నాడు. శిరకి మోకాలు అడ్డుపెట్టేడు ప్రత్యక్షంగా సుఖించలేక పరోక్షాన్న మోక్షం వుందని ఆశించాడు అధర్మాలకు మార్పు లేదనుకొన్నాడు. ఆ పరిస్థితిలో తన దుడుకుచేష్టలు తండ్రికి చెపుతాడేమోనని భయపడి తనే ముందు తయారైంది చిత్రాంగి నేరారోపణకు. ప్రాణభయం చేతనే పాము మనుష్యులను కరుస్తుంది. తేలు కుడుతుంది. యీలాంటివనేక విషయాలున్నాయి సరే ప్రభాకరం రాధతో యీలా అన్నాడు.

ప్ర: మందూ కాదు, మాకూ కాదు. మీ యింటికి మామూలుగా ముట్టయినట్టు కూర్చో అనుమానం కలగనీయకు. తరువాత నే చెప్తాను.

రా: తరువాత ఏం జేస్తారు?" అంది ప్రశ్నార్థకంగా మా తలిదండ్రులు విడిచిపెడితే?.

ప్రి: నేను తీసుకుంటాను నా దగ్గర వుందువుగాని ఏం?

రా: నిజమేనా? వాగ్దానమేనా? మళ్ళీ తప్పిపోతారా?

ప్రి: "ఏమీ భయంలేదు నీ విషయంలో ఏమీ భయం లేదు అనుమాన పడకు, నా ప్రాణం పోయినమీదట గాని నీకు విపత్తు వాటిల్లదు. నువ్వు అమాయకురాలవు, త్యాగమూర్తివి. నిన్ను అవసరమైతే పెండ్లి చేసుకుంటాను నా భార్యవు రాధా. నీ గుణాలకు నా కవిత్వం చాలదు. ఎంత అప్రయోజకున్నయినా నిన్ను మోసం చెయ్యనులే. వ్యభిచారినని భయపడుతున్నావు. భయంలేదు" అని అభయహస్తం యిచ్చాడు.

రాధ చెప్పలేని ప్రేమతో అతనిమీద పడి మెడపట్టుకొని అల్లాగే వుండిపోయింది. అశ్రువులు రాల్చింది. పొంగిపోయింది. నమ్మింది ధైర్యం వహించింది. అనుదినమూ నేనూ ప్రభాకరం ప్రత్యక్షంగా సుఖించవచ్చు ననుకొంది. ఆమె ఆశలు అపారపారావారపర్యంతాలు. ప్రేమ నిష్కల్మషం, స్వార్థరహితం. కొంతసేపటికి కూర్చున్న ప్రభాకరాన్ని పందుకొండి అవి భుజం తట్టి లాగింది. ఒక అనుకూల భార్యాభర్తల భావాలు స్ఫురించాయి వారి చర్యల్లో ఆనందానికి

లోతు చూస్తున్నారు,

లీ: అయితే అన్నయ్యా మొదటి నెలల్లో వేవిళ్ళబాధ ఉంటుందంటారు. అదేమీ సంభవించలేదూ రాధకు?

ము: సంభవించకేం సంభవించింది, అదేదో జబ్బో జ్వరమో అనుకొన్నారు. గర్భిణీ అని ఏలాగు అనుకుంటారు నెల నెలా ముట్టవుతోంటే. ఆఁ

లీ: ఆ స్థితిలో ప్రభాకరం వచ్చి చూడలేదా?

ము: లేదు ఎట్లా వస్తాడు. ఆస్థితికి కారణం అతడెరుగును పైగా అతడెప్పుడూ అక్కడకు రాడు అందుచేతనే వాళ్ళకేవిధమైన అనుమానమూ లేదింట్లో.
సరే ఏదో డాక్టరును పిలిచి ట్రీటు చేయమన్నారు డాక్టరువచ్చి చెయ్యి చూశాడు. ఏం తెలుస్తుంది డాక్టరుకు. నీరసంగా వుంటుందా అన్నాడు అవునంది రాధ.

అన్నం సహించదా? సహించదు
విరోచన మవుతోందా? అవుతోంది
నిద్ర పడుతోందా? పడుతోంది
అబ్బే ఏమీ లేదండి వీక్నెస్. కొంచమేదయినా టానిక్కిస్తే రికవరై పోతుంది త్వరగా పుచ్చుకొమ్మనండి అని చెప్పేసి వెళ్ళిపోయాడు మందు పేరు చిన్న కాయితంమీద రాసి యిచ్చి. రాధ లోలోపల నవ్వుతోంది అంటే "ఏం"అని లీలావతి నవ్వింది, లోగుట్టు

డాక్టరుకేం తెలుస్తుంది జబ్బంతా కనుక్కొని బాధ
లన్నీ తెల్సుకొని ఆరకపు జబ్బుకు వైద్యగ్రంథాల్లో
ఇవ్వాలని వుంటే అవి యిస్తాడు. అంతేకాని ఏజబ్బు
ఏవయస్సులో ఏలా సంభవించిందో పరిస్థితులను పరి
శీలించి తెలుసుకోవడం (diagnosis)లో వుంది
డాక్టరు వివేకం. అ నేకాని వున్న జబ్బును పెంచి
రోగిని రోగి తాలూకు బంధువుల్నీ ఖంగారుపెడతారు
సాధారణంగా డాక్టర్లు డబ్బుకోసం. పాపం మన
డాక్టరు ఆలాగు చేయలేకగాని విషయాన్ని వాస్త
వికంగా తెలుసుకోలేకపోయాడు. అదిగాక పోయినా
ఆజబ్బు ఆమెకు ఆతడికేగాని డాక్టరికీ మనకీ ఏం
తెలుస్తోంది.

సరే యీవిధంగా కొద్దిరోజులు బాధపడి స్థిమితపడింది
రాధ. మళ్ళా ప్రణయప్రయాణం ప్రారంభించింది,
కులాసాగా గడిచిపోతున్నాయి రోజులు. ప్రభాకర
ప్రతిపాదిత బీజాభివృద్ధి సక్రమంగా జరుగుతోంది.
ఏవిషయమైనా రహస్యంగా తెలివిగా దాచొచ్చు
గాని ఆ యవయవాలలో కలిగే మార్పు ఏలా దాచ
గలం? తల్లి గర్భిణిని గుర్తించి గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నిం
చింది. ఎన్నిసార్లడిగినా నిజమే అని తల వూపుతుందే
గాని కథానాయకుని నామం చెప్పదు. ఏమిటిదంతా
మాఖర్మం కాలిపోయిందని నెత్తినోరూ బాదుకొని

యేడ్చింది తల్లి. తల్లి హృదయంగాం పిల్ల ఏతప్పుచేసినా క్షమిస్తోంది. పక్షపాతం వహిస్తోంది అతిప్పు పనే చేసినట్టు భావిస్తోంది. కడకు శిక్ష లేశమైనా విధించ లేదు.

తండ్రికి చెప్తామనుకొంది గాని రాధ తల్లికి సాహసం చాలలేదు. విషయం విషమించింది ప్రాణం మీదికి వచ్చింది నెలనెలా బైటకూర్చుంటే ఏమో అనుకొంది గాని నాటకమని తెలియదు. చెప్పకపోతే తీరేట్టు లేదు. అగ్నిప్పులాంటి కుటుంబము, బంధుగౌరవ శ్రీయము కలవారు మీదు మిక్కిలి ప్రభుత్వోద్యోగులు. వారకంటే సామాన్యులుతో సంపర్కం వుండదు. కాబట్టి ప్రజాసామాన్యానికి యింకా ఏమీ తెలియలేదు. కాని ఆగదు తెలిసిపోతుంది. సగే ఒన్నిసులు అయినతర్వాత ఆరాత్రి మేజిస్ట్రేటువారు యింటికి వచ్చేరు. స్నానభోజనాదులైన వెనక అటూ ఇటూ తిరుగుతూ ౬-౧౦ సిగరెట్లు కాల్చి అనంతరం శయనాగారం చేరేవారు. అంతకన్నా పనేముంది నిర్వ్యాపారం. భాగ్యవంతులు, సాధారణప్రజాదోషం వారలకక్కర లేదు. అందుకే యిలాంటివి వస్తూవుంటాయి. భార్య కళావిహీనాననంతో వచ్చింది. ముఖవైఖరి విచారాన్ని సూచిస్తోంది, 'ఏం" అన్నాడు మేజిస్ట్రేటు.

మే।భా। ఏమీ లేదు.

మే। ఏమిటి చెపుదూ.

భా: అమ్మాయి పెళ్ళివిషయంలో ఎంత తొందర చేసినా ఇంకా అతను చదువుతున్నాడు చదువుతున్నాడని చదువయిందాకా చెయ్యకూడదనే అన్నారుగాని

మే: అవును పెళ్ళయితే చదువుసాగదు. చదువు పూర్తయ్యాక పెళ్ళిచేసుకోవాలి, అట్లా చేసుకున్నాను గాబట్టే నాకు B. A. తో ఇంగ్లీషు అల్లాగే ఉండి పోయింది.

భా: యీడొచ్చిన పిల్లను విడిచిపెట్టడం మనదే తప్పు లెండి.

మే: ఏమిటి పెద్ద యీడొచ్చిందటావు. యీ ఏప్రిల్‌తో 18 ఏళ్ళొచ్చాయి. 20 ఏళ్ళదాకా పెండ్లి పనిలేదు.

భా: నాకేలెండి. అన్నీ యెరిగినట్టు మాట్లాడతారు. మీ మూలాన్నే యీ ముప్పంతాను యిప్పుడు.

మే: ఏమిటిప్పుడు?

అంటే అతడి ధర్మపత్నిదగ్గరగా జరిగి తలుపులు తీసివున్నప్పటికీ నలువైపులా చూస్తూ నెమ్మదిగా అమ్మాయికి కొంచెం— అని నాంచింది.

మే: 'ఏమిటి, ఏమిటో చెప్పు'' అని గట్టిగా అడిగాడు న్యాయాధికారి ఆత్రంతో.

భా: గర్భం వచ్చినట్టుందండి.

మే: నాకాసేపాన్ను ఏలా వస్తుంది. నిజమే? అన్నాను భయోత్పాతంగా, "ఏం ముట్టవడంలేదా?

భా: లేకేం. వస్తేనెలా బైట కూర్చుని మనలను బుట్టలో పెట్టింది. ఇప్పుడు ఆరో నెలో ఏడో నెలో అయివుంటుంది పైకి తెలిసిపోతూనే వుంది.

మే: అంత ప్రమాదించిందీ. ఓరి రాస్కెల్ యేదీ యెక్కడుంది. ఇలా పిలూ దాన్నిట్టు తెగతిని వాళ్లు పోగరు. వాడెవడు?.

భా: ఏమో?

మే: ఏడిశావులే వెధవముండా నీ మూలాన్నే యిదంతాను. పిల్ల తప్పు తల్లిది. నువ్వు కేర్ తీసుకుంటే ఇలాంటి పని జరగదు. అతిగారాబం ఇప్పుడేంచేస్తాం. మర్యాదా గంగలో కలిసింది. అందర్నీ మనమన్నట్టే అంతా ఆబాలగోపాలం మనలను వేలెట్టి చూపిస్తారు. ఎవరైనా గ్రహించారా యేంటి యీ విషయం.

భా: లేదు యింకాను.

మే: అదీ కొంతనయమే నేను రేపే కలవు పెట్టేస్తాను. నాకు లీవుందిలే వెళ్ళిపోదాం ఏపూరన్నా పొమ్మను రండముండని ఇంక తలెత్తుకోలే. అయినా యింట్లో ఇంక క్షణం వుండకూడదు. నీ ప్రేమను చంపుకో లేకపోతే నువ్వు అది కలసి పొండి కని విరగడైపోతుంది. భరించలేని అపరిదిష్ట తీరని కళంకం 'ఛీ, ఛీ'

అని కోపంగా అంటూవుంటే 'కార్యాలోచన వూడాలిగాని అరిచి అల్లరి చేసుకుంటే ఏం లాభంవుంది. చెప్పండి?' అంది అతని ధర్మపత్ని.

మే: ఆలోచనేముంది, ఆలోచన.

భా: ఏదో ఆలోచించాలి. గర్భిణీ నిర్భేజ్యం. విషం పెట్టి చంపలేం. కనుక్కొన్న బిడ్డ. అలాగని యింట్లో వుంచుత్తే ఏ ముఖంపెట్టుకుని నలుగుర్నీ చూడగలం. పోనీ ఏదో తప్పుపనంటే కాలంలో కలసిపోతుంది గాని, కన్యకు కానుకే సంభవించడం కలకాలం వుండే కళంకము. అంచేత ఏదో ఎక్కడికో దూరప్రదేశానికి పంపించడమో, యేదో చేసి ప్రాణాలు కాపాడాలి. అంతేగాని ఇప్పుడు తొందరపడి యేంచేసినా తరువాత పశ్చాత్తాప దావానలాని కాహుతైపోతాం. చక్కగా ఆలోచించి చేస్తే కొంత బాధ తీరుతుంది. గుడ్డిలో మెల్ల, ఏమంటారు?

అంటే మేజస్ట్రేటు దీర్ఘంగా ఆలోచించి త్వరలో ఆవూరు విడిచిపెట్టి ఒక జనసమర్ధంగల ఒకరిగోడవ ఒకరికి అక్కరలేని మహా పట్నానికి వెళ్లడానికే నిశ్చయించాడు. అది మంచి యేర్పాటే చెల్లాయీ పెద్ద పట్నాలలో ఒకరితో ఒకరికి నిమిత్తం వుండదు. వాకబూ చేయరు. ఎవరిగోడవ వారిది పట్నాల్లో ప్రజాజీవనం పల్లెలలో జీవనంవలె కట్టుదిట్టాలతో

కూడుకొని వుండదు. మానవులు సంఘనియమావళిని వుల్లంఘించి స్వేచ్ఛావిహారం చేయడానికి అవకాశం వుంటుంది పట్నాల్లో.

అక్కడ ఎవరు వ్యభిచరిస్తున్నారు, ఎవరు సక్రమంగా ప్రవర్తిస్తున్నారు మొదలైన గొడవలకు ప్రాధాన్యం లేకుండా ఎవరి దారి వారి కోర్కెగా అభివృద్ధి నిరోధకంగా పోవడానికి నగరవాసం ఒక కారణం కాకపోదు. ఏమంటే సాధారణ ప్రజాజీవితంతో పట్టించుకో వలసిన పని అట్టేమందికి వుండదు. అంటే మదరాసు వెళ్ళడానికి అక్కడ జనరల్ ఆసుపత్రిలో రాధను in-patient గా జేర్చి ఆ విధంగా ఆమె నక్కడ విడిచి వచ్చి 'రాధేది' అనే ప్రశ్నకు ఏదో జబ్బుచేస్తే ఆసుపత్రిలో in-patient గా చేర్చామని చెప్పడానికి నిశ్చయించుకున్నారు రాధ తలిదండ్రులు. తెలివితేటలుగానే వుంది plat. ఏం చెల్లాయీ?

లీ: మరయితే పురుటినుంచివచ్చింతరువాత తెలియదేమిటమ్మా.

ము: ఓహో దీర్ఘంగానే ఆలోచించావు మరి ఓసుకు రారు. అక్కడే విడిచిపెట్టేస్తారు కొన్నిరోజులు పోయాక రాధ ఆసుపత్రిలో మరణించిందని పత్రికల్లోకాని కూడా తెలియకపోదనుకో. చూశావా

పరిస్థితి, తల్లికి, తండ్రికి బిడ్డమీద చిరకాల ప్రేమను రూపు మాపాయి, అప్రతిష్ట, అప్రఖ్యాతీ.

లీ: నిజమే అన్నయ్యా, పరిస్థితులేవనినా చేయిస్తూ వుంటాయి. ఆ సందర్భంలో ఏ తలిదండ్రులైనా అంతే చేస్తారు. కొందరు విషప్రయోగంకూడా చేస్తారు అలా చేశారని మొన్ననే విన్నాం కూడా. ఆస్తులకోసం చంపుకుంటారుగా అల్లాగే ఇదీని.

ము: అల్లా దాన్నికి రా. బోధపడిందా పరిస్థితి కెంత బలం ఉందో.

లీ: తరువాత ఏమయిందన్నయ్యా?

ము: పరిసర ప్రాంతాలలో వున్నవాళ్ళకు తెలిసిందే ప్రభాకరానికీ తెలుసు. రాధ మదరాసులో ఆసుపత్రిలో యిన్ పేషెంటుగా ప్రవేశించిందనీ అవివదంతి. మళ్ళీ మేస్త్రీటుగారు ఆ వూరు రాలేదు. కలవ్రమీద స్వగ్రామం పోయి విచారంతో కుంగిపోయాడు. కుమార్తె యడబాటుకంటె సంఘముయొక్క అధిక్షేపణ యెక్కువ భారంగా కనుపించిందా తల్లిదండ్రులకు. ప్రభాకరాన్ని కేమీ తోచలేదు. మదరాసు వెళ్ళడమా? వెళితే ఆమెను కలుసుకోడానికి వీలవుతుందా, వారెవరో ఒకరు అక్కడ వుండకపోరు యిదార్థం వారికిపాటికి తెలిసిపోయే వుంటుంది. నేను ద్రోహి ననుకుంటారు. ఇట్టితరుణంలో నేను వెళ్ళడం

మరీ ప్రమాదం. సరే చూదాం. అని అనుదినమూ మనశ్శాంతిని కోల్పోయి ఆశతో తిరుగుతున్నాడేమయినా తెలుస్తుందేమోనని. కాని ఏమీ తెలియలేదు.

క్రమంగా రాధకు ప్రసవకాల మాసన్నమైనది. బాధ పడింది. నర్సెప్పుడు అనుదినమూ చూస్తూవుండే వారు లేడీడాక్టర్లు పరీక్ష చేసింది. ప్రసూతి బాధ చెప్పడానికి వీలులేదుకదా?. ధనుంజయరావు బాధ ననుభవించి ప్రసవానంతరం శిశువును చూచి రాధ ఆ బాధ మరచిపోయింది.

లీ: ఏంపిల్ల?

ము: ఏంపిల్ల అనేదేముంది బ్రతుకలేదు మూడవనాడు చనిపోయింది ఆడపిల్ల

లీ: ఆడపిల్లా? చచ్చిపోయిందా? పాపము. ఆసుపత్రిలో సరిగ్గా చూడకా ఏమిటన్నయ్యా?

ము: అబ్బే చూడక కాదు ప్రభాకర్రావుకు సుఖసంబంధమైన జబ్బులున్నాయి. అతని రక్త మపవిత్రమైనది. అంచేత తిన్నస్థితిమైన శిశువు నశించింది.

లీ: ఓహో. పాపం.

ము: రాధకు కూడ చాల జబ్బు చేసింది. తరువాత కొంత కాలానికి కొంచెం నయమవగానే 'ఆసుపత్రినుంచి వెళ్ళిపోవాలి మీ నాన్నగారి ఎడ్రసు చెప్పమ'న్నారు.

ఆసుపత్రి అధికారులకు చెప్పింది. వారు ఉత్తరాలు రాశారు. జవాబు శూన్యం ఎన్నిసార్లు రాశినా అంతే. ఎన్నిసారులు ఉత్తరాలు రాసినా మీ వారు జవాబు రాయలేదు రిజిష్టరీ నోటీసు ఇస్తే తిరస్కరించారు. మాకు కొంత బిల్లు యివ్వాలని చెప్పేరు రాధతో. డాక్టర్లు వారున్నూ. రాధ 'నా అకార్యానికి వారు నన్ను వొదిలిపెట్టి వుంటారు అవును నా మూలాన్ని వారికి అప్రదిష్ట అందుకే యీఎత్తు ఎత్తేరు. విచారిస్తే ఏంలాభం!' అని మనస్సులో సంకటపడి తనకు మిగిలిన ప్రభాకర్రావు అడ్రస్సుకో ఉత్తరం రాశింది.

లీ: ఏమని?

ము: ప్రభాకర్రావుగారూ.

మీకు ఒక్క బాలిక పుట్టి మూడు రోజులుండి మన యిరువుర్నీ విషాదతుషారంలో విడిచిపోయింది. నాన్నగారికి అమ్మగారికి యీవిషయంలో డాక్టర్లు వ్రాస్తే అసలుజవాబే ఇవ్వలేదు. రిజిష్టరీనోటీసుకూడా తిరిగివచ్చేసింది. అందేవారు నన్ను విసర్జించారు. అంత్తే మనమనుకొన్నట్టే అయిందంతా. నాకు కొంచెము స్వస్థతగానేవుందికాని పూర్తిగా ఆరోగ్యంగా లేదు. నేను ఇక్కడ ఒక్క క్షణం వుండలేను. నాభారం మీమీద పడింది. ఆబాధ్యత మీరు వహిస్తారనే నమ్మకం వుందనుకొండి. అయినా పాపం నామూలాన్ని విలాసంగా తిరిగే మీకు విషాదమాపాదించింది. మీకు తలిదండ్రుల

చాటువారు. నన్నేంచేస్తారు. కర్తవ్యం గోచరించడంలేదు. ఏది యేలాగైనప్పటికీ మీరు దబ్బున రెక్కలు కట్టుకొని వచ్చి నాకు కనిపించాలి. మీరువస్తేనే నాకు పూర్తిస్వస్థత వుంటుంది. మీదర్శనానంతరం మీరు చెప్పినట్లు చేస్తాను. యెంతశ్రమ యివ్వవలసి వచ్చిందండీ మీకు. అధైర్యపడకండి. అమాయికంగా నేను మిమ్మల్ని ప్రేమించి ప్రవర్తిస్తే ప్రమాదించింది. లోకమంతా యేకమయినా నాకు మీ పట్లగల అనురాగాన్ని అరికట్టలేరు. నిరాధారనై స్వార్థం కోసం యీలా చెప్పడంలేదు. మీరెరుగరా? శెలవు. త్వరగా రావాలిసుమా! నమస్కారము.

రాధ.

ఉత్తరం యిచ్చాడు తపాలా బంట్రోతు మన కథానాయకు ఆడదస్తూరీ అని గ్రహించి ఆత్రంతో విప్పి చదివాడు. ఇంకేముంది? ప్రణయానంతర ప్రళయం. అధైర్యపడలేదు. విషాధాంధకారంలోనే ఆశాజ్యోతి మిణుకుమిణుకుమంటోంది. రాధ తన ధనం అయితే ఆ రాధా ప్రేమధనాన్ని తెచ్చుకోడానికి కృత్రిమధనం లేదు ధనం లేందే ఏముంది యీలోకంలో ధనమే ప్రతి కార్యానికి ప్రధానసాధనం. ధర్మానికి ధనముండాలి దైవ ప్రార్థనకు ధనముండాలి దైవ ప్రతినిధియైన పూజారి దర్శనానికి ధనముండాలి. ధనవంతుడుకే తెలివితేటలుంటాయి. దబ్బుతో అనేక వ్యవహారాలు చేస్తూవుంటే అప్పుడు తెలివితేటలు. ఆరోగ్యం కావాలంటే

మంచి ఆహారం తినాలి దానికీ డబ్బు కావాలి. ధనం ప్రధానం కాదు గుణముండాలి అంటారు మూర్ఖంగా కాని ధనంలోనే గుణాన్ని సూస్తారు. ధనహీనునికి వాక్స్వాతంత్ర్యం కూడా వుండదు. ప్రభుత్వం శాసించే ప్రతిచట్టం ధనికుల కనుకూలంగానే వుంటుంది. బిరుదులు పొందాలంటే ధనముండాలి. న్యాయస్థానాల్లో న్యాయం కావాలంటే దొరుకుతుంది కాకపోతే కొంచెం ఖరీదు హెచ్చు. ధనంతో సర్వ ప్రభుత్వ శాఖలనూ బంధించి స్వారీ చెయ్యొచ్చు. పేదవాడికి డబ్బు లేకపోవడమే ఒక నేరం. నిర్ధనుడున్న దానితో సరదాపడి ఒక అలంకారము చేయించుకుంటే అనుమానించి పోలీసు పట్టుకుంటారు. కోర్టులో సాక్ష్యం చెప్పడానికి పోయినవారు ముఖ్యంగా ఆస్తిపాస్తులను నిరూపించుకోవాలి. ఏమంటే నిరాస్తిపరుడు నిజం చెప్పలేడని దాని అర్థం. ధనవంతుల ఒత్తిడికి లోనై నిరుపేదవారు ఒక్కొక్కప్పుడు నిజం చెప్ప లేకపోవచ్చు కాని ఆ ఒత్తిడిని కలుగజేసేవారు ధనికులు కనుక ధనార్జనలోనే అబద్ధము, అన్యాయము, అమర్యాదాలు, పుడుతున్నాయని న్యాయమూర్తులు ఎందుకనుకో కూడదు? అనుకుని ఆ విధమైన అక్రమ విధానాలను అరికట్టి సర్వజన సానుకూలమైన ఆర్థిక విధానం అమలు పడితే అక్రమాలన్నీ అడుగంటిపోతాయని తెలిసినప్పటికీ కూడా స్వార్థపరులు మితిమీరిన నాగరికులు అభివృద్ధి నిరోధకులై శ్రేయస్కరమైన పరిణామానికి అడ్డు తగులుతారు ప్రభుత్వం

న్యాయమైనా అన్యాయమైనా పెద్ద పెట్టున చేయ
గలదు. అటువంటి ప్రభుత్వమే అల్పసంఖ్యాకులకోసం
అధికసంఖ్యాకులను స్వసుఖం కోల్పోమంటోంటే
ఎవరు మన్నించి గౌరవించగలరు?

లీ: ఏం అన్నయ్యా; నీకు ప్రభుత్వమంటే అంత కోపం.

ము: కోపం కాదు చెల్లాయి ధనవంతుల శ్రేయస్సే చూచి
కోటానుకోట్ల ప్రజలు యేమయిపోతున్నారో, చూ
డకుండా నిరంకుశంగా ప్రవర్తించటంలేదా ప్రభుత్వం?
ప్రజాసంరక్షణ బాధ్యత లేదు ప్రభుత్వానికి? దొంగ
తనం చేస్తే దొంగతనం నేరానికి శిక్షించినా ఒకడు
దొంగతనం ఎందుకు చేస్తాడు వాడికి తిండి ఉందా?
పనుందా? ఏ పరిస్థితులలో వాడు ఆవిధమైన అవినీతికి
దిగవలసి వచ్చిందో కూడ కనిపెట్టి ఆ పరిస్థితులను
తొలగించ డానికూడా ప్రయత్నం చెయ్యాలి పరి
పాలకులు. ప్రజలకు యథార్థ మర్థమైనప్పుడు,
ఆత్మగౌరవాది విజ్ఞాన ఖడ్గాలు మూఢవిశ్వాస శృం
ఖలాలిని ఖండించి నప్పుడు ద్విగుణీకృత దారిద్ర్యం
లోంచి అన్నాతురులైపోతున్న ప్రజలలో అయిక
మత్యం ప్రబలినప్పుడు ఆర్థిక విముక్తి దాస్యవిముక్తి
పాటంతటవే యేర్పడతాయి. ప్రమాదకరమైన ప్రస్తుత
వ్యవస్థ మారిపోయి తరగతి రహితమైన ఆర్థిక సౌష్ట

వముగల నూతనవ్యవస్థ ఏర్పడుతుంది. అప్పుడు మానవులు సామాజికంగా అభివృద్ధి పొందుతూ వేగంగా పురోగమిస్తారు.

పాపం ప్రభాకరానికి డబ్బులేదు. ధనవంతులైన స్నేహితులున్నారు. రామారావున్నాడని చెప్పేంగా ఇదివరకు. అతడు తదితరులు కొంచెం సాయంచేసేరు దానితో అతడు మదరాసు పోయి ఆసుపత్రిలో చెల్లించవలసిన బిల్లు చెల్లించి రాధను తిన్నగా ఇంటికి తీసుకువచ్చాడు. కాని వాళ్ళ తండ్రి ఇంట్లోకి రానివ్వలేదు. రాధను విడిచిపెట్టకపోతే తన్నుకూడ ఇంట్లోకి రానివ్వ నన్నాడు. ఆ సందర్భంలో అతడొక ఇల్లు స్వల్పమైన అద్దెకు పుచ్చుకుని అందులో పెట్టేడు. కాని భవిష్యదెట్లా ధనమేది? ఏమిటి చెయ్యడం? అతడి కేమీ తోచలేదు. పడ్డవాడిమీదే పది రాళ్లు పడతాయి. కష్టాలన్నీ అయికమత్యంగా ఒక్కసారే దాడి సలుపుతాయి ఎవరిమీదన్నా జర్మన్ సైన్యంల్లాగ. రాధకు జబ్బు తిరుగబెట్టింది, పత్యం జరక్క సదుపాయం లేక మళ్ళీ జబ్బుచేసింది ఆస్థితిలోఅతడు రామారావు దగ్గరకుపోయి తాను చాలా అపాయస్థితిలో వున్నానని తనకు ధనం మనుష్యసహాయం కావాలని చెప్పాడు. ఇద్దరూ మాట్లాడుకుంటూ రామారావు ఆఫీసుదాకా వెళ్ళేరు. 'నీకే

మీాభయం లేదు ఏదో విధంగా నేను చూస్తాలే ఇంటికి వెళ్ళి మీా చెల్లాయితో మాట్లాడు. వస్తానని ధైర్యం చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు రామారావు. ప్రభాకరం దీనంగా రాజ్యం దగ్గరకు వచ్చేడు. ఎప్పుడూ మహోల్లాసంగా వుండే ప్రభాకరం ఎందుకో యీాలా లో లోన కృసించిపోతున్నాడని రాజ్యం ఆదరంగా,

'రా అన్నయ్యా, కూర్చో; ఏమిటి విశేషాలు'? అంది. అంత ప్రభాకరావు అంతకు మున్నే రామారావు ద్వారా సర్వం విన్న రాజ్యానికి తన ప్రస్తుత పరిస్థితిలో మనుష్య సహాయం కావాలని అరించాడు.

రాజ్యం: నేనుండగా నీ కేంభయమన్నయ్యా మా వదినకు జబ్బుచేస్తే నేను పరిచర్య చేసుకోనా?

ప్ర: అది యెలా వీలవుతుంది? మీారు సద్బ్రాహ్మణులు మేము తదితరులం. రాధ నాకు సంఘామోదం పొందిన భార్యకూడా కాదు. అందుకోసం నువ్వామెకు పరిచర్య చేస్తే సంఘములో తీవ్ర సంఘర్షణ కలుగుతుంది. అన్యోన్యంగా మాట్లాడ్డానికి తప్ప అంతకు మించి ప్రవర్తించడానికి వీలులేదు.

రా: ఆ ఏమిటన్నయ్యా మీాకు ఆపద కలుగుతే మేము సహాకరించకుండా వుండడం అసాధ్యం. ఆయన రాగానే

రేపే మేమక్కడకు వచ్చేసి నేనే వంటచేసి వాదినకు వుపచారం చేసుకుంటాను అప్పు డేగొడవావుండదు.

ప్ర: నీవు కోరిచేసే ఆదరణ వొద్దన్నగాని కష్టం తరువాత పశ్చాత్తాపపడి లాభంలేదు.

రా: పశ్చాత్తాపం లేదు, ఏమీలేదు. ఒకరు అంటారని మనము జంకకూడదు. న్యాయసమ్మతమైన కార్య సాధనానికి పూనుకున్నప్పుడు. సానుకూలతా ప్రతి కూలతా నిమిత్తంలేకుండా త్యాగం చెయ్యాలి. అన్నీ నువ్వే చెపుతావు. మళ్ళీ యిలా అంటావేం? స్వవిష యంలో కవులకుకూడా మతి పోతుందా యేమిట నయ్యా? అని చురుగ్గా చనువుగా అంది రాజ్యం నాగాశావా చెల్లాయీ వారి పరస్పరానుకూల్యం?

లీ: చాల విశాలభావాలుకలదానిలా కనిపిస్తూంది రాజ్యం అంత కార్యదీక్ష వుండడం త్యాగబుద్ధి వుండడం ఎంత కష్టం అంత ప్రభాకరాన్ని నోరెత్తకుండా చేసింది.

ము: వాళ్ళెప్పుడూ అంతే. అంత సరదాగా చనువుగా మాట్లాడుకుంటారు. అభిప్రాయభేదాలు లేవు మరు నాడు రామారావు రాజ్యం ప్రభాకరం యింటికి వెళ్ళి అక్కడే మకాంపెట్టేశారు. రాజ్యం వంటచేస్తూంది. పరిచర్య చేస్తోంది. ఆత్మాభిమానము గర్వము సంకోచము ఏమీలేదు. ఆజీవమే అలా గడుపుకుం టున్నారు. ఒక డాక్టరును పిలిచారు. ఆయనవచ్చి

కంటకరుజాపీడితగ్నైన రాధను పరీక్ష చేశాడు.

డా. ఓచాలా సీరియస్సుగా వుంది.

ప్ర: What is the matter (ఏమిటి సంగతి)?

డా: Intial stage of T. B. (క్షయ ప్రారంభదశ). Most jumping sort (త్వరితంగా వ్యాపించేది)' అని బయటకు తీసుకువెళ్ళి Treatment (చికిత్స) అక్కరలేదు. More than one year impossible (సంవత్సరంకన్న ఎక్కువ జీవించదు). మంచి ఆహారం అదీ యివ్వండి. అంతకంటే ఏమీ చెయ్యలేం' అని చెప్పి డాక్టరు నిరాశ చేసి వెళ్ళిపోయాడు. పాపం ఎలా వుంటుంది పరిభాకరం హృదయావేదం? హృదయాకాశం నిరాశా మేఘావృతం అయింది. భవిష్యత్తు పాతాళకుహరం. ప్రాణసమాన రాధ జీవితం సంవత్సర పరిమాణం

లీ: పాపం తల్లిదండ్రులు కూడ విడిచిపెట్టారతన్ని. రాజ్యం ఎంత మంచిదన్నయ్యా నిజమే అన్నయ్యా మనం కూడా మాలమాదిగ భేధాలు పాటించడం మనవశువులను గాసి నమ్మకంగా తక్కువ జీతానికి ఎక్కువ కష్టపడేవాళ్ళను నిరాదరించడం తప్పు కాదూ?

ము: మనం మనం మన్నించడమేమిటి చెల్లాయి కాలమే తీసుకొస్తుందా మార్పు. పంచములు కనుపిస్తే కండ్లు చిట్లించేవారంతా రెండు చేతులూ ఎత్తి నమస్కరిస్తున్నారు,

లీ: ఏమో?

ము: కొందరు పెద్ద పెద్ద పదవులలో వున్నారుగనుక, నమస్కరించడం యేమిటి? భోజనాలే చేస్తున్నారు. వివాహాలే జరుగుతున్నాయి కులాంతరంగా. నిర్ధనుడు ఏకులంలో వున్నా నిరాదరింపబడుతూనే వున్నాడు. అందుకని ముందు ఆర్థికం చక్కబడితే తరువాత కులాలు గిలాలు అన్నీ రద్దయి చక్కని సాంఘిక సంస్కారం జరగడం అతి సులువు.

లీ: కులాంతరంగా వివాహమయినవారు బహిష్కృతులు గారా?

ము: నిరర్థకమైన బహిష్కృతికేం లే. డబ్బుంటే వారి పాద పక్షాళనలు చేస్తూ తిరుగుతారు కులవాదులంతా. ధనం ప్రధానం. హరిజనులకింకా పూర్తిగా సాంఘిక విముక్తి కలుగలేదూ అంటే ఆర్థికంగా వెనకబడివుండడంచేతనే. రాజ్యంలాంటి వుదారస్వభావం ధైర్య స్థయిర్యాలు కలవారుగా స్త్రీపురుషులంతా మారితే దేశానికి మార్పు నూతనవిన్యాసం కలుగుతాయి. ఎంతపరిచర్య చేసిందనుకొన్నావు పాపం. తనకేం గావాలి చెప్పు? లోకంతోపాటు తనూ వూహల్లో లేదూ?

డాక్టరు వెళ్ళాక లోపలికొచ్చారు ప్రభాకరం. డాక్టరు చెప్పిన మాటలు సుస్పష్టంగా వింది రాధ.

రా: ఏమండీ ఏమన్నారు డాక్టరుగారు?

ప్ర: అబ్బే ఏమీ లేదు. శ్రద్ధగా మంచి ఆహారం పండ్ల రసం తీసుకోవాలన్నారు. ఏం?

రా: ఆ! నేనాలకించలేదా? విన్నాను. నాకూ కొంచెం ఇంగ్లీషు తెలుసు. అభిమానంతో అలాఅంటున్నారు. అని కెవ్వన యేడ్చి కొంతసేపటికి మళ్ళీ తేరుకొని సంవత్సరంలో నేనెలాగో చనిపోతాను. నాకోసం మీరెందుకీలా మాతాపితృ విస్మృతుగా వుండటం వెళ్ళిపొండి. నాకు ఏవిషమో ఇవ్వండి. ఎప్పుడో అయ్యేది ఇప్పుడే అవుతుంది. నన్ను కాపాడుకోలేరు. రెండూ చెడడమెందుకూ? మీ క్షేమంకోరే చెప్తున్నాను.

ప్ర: చాల్లే ఇంకూరుకో రాధా. విసివి వేసారిపోయిన నా మనసు మరీని రాశ్రియం అవుతుంది నీవలా యేడుస్తే. యేది యేమయినా మనం ప్రకృతి విరుద్ధంగా ఏమీ చెయ్యలేం. అని రాధ మంచముమీద కూర్చుని కన్నీళ్లు తుడుస్తున్నాడు తనధవళాంబరంతో. అంతలోకి రాజన్నా అన్నయ్యా అంటూవస్తే మంచం మీదనుంచి లేచిపోయాడు.

పొదినా అదియేమిటి? వదిన ఏడుస్తోందెందుకు? ఏం వదినా? ఆదేమిటమ్మా! ఏడవకు మా అన్నయ్యకు మనశ్శాంతి వుంటుందా నువ్వు ఆలావడుస్తే?

అని రాధ దగ్గర కూర్చొని తనూ ఏడుస్తోంది. స్త్రీ కాదు దుఃఖోపశమనం చేస్తూనే దుఃఖిస్తుంది.

రాధ: లేదు రాజ్యం నాఆయువొక సంవత్సరం అని డాక్టరు గారు చెప్పేరు.

రాజ్యం: నిజమా అన్నయ్యా? అం వట్టిది.

రాధ: నిజం నేను విన్నాను దానికొకు మీ అన్నయ్య నామూలాన్ని నిష్కారణంగా జీవితం పాడుచేసుకుం టున్నారు. ఎంత చెప్పినా వినరు. ఇంటికి వెళ్ళమని తల్లిదండ్రులను సుఖపెట్టమని చెప్తూతున్నాను. పాపం అమాయకుడు వారిసుఖం వారికే తెలియదు.

రాజ్యం: వూరుకో వొదినా అన్నయ్యకేంలోటు? నువ్వలా కంటతడి పెట్టుకోకు మాటిమాటికీ. అని వోదార్చి పండ్లరసం తీసి రాధకిచ్చి వంపింది భోంచేయరా దన్నయ్యా అంటే రామారావు వచ్చేక చేస్తా నన్నాడు పరిభాకరావు. ఆయన యెప్పుడొస్తారో అప్పటిదాకా నువ్వుండలేవు నువ్వు ముందు భోంచె య్యి అని రాజ్యం తిరిగి కోరగా అక్కరలేదని తల వూపాడు రాధాప్రియుడు. అతడాట్టే మాట్లాడలేక పోతున్నాడు. అర్థంకాని విచారాభినయం చేస్తు న్నాడు. పాపం.

లీ: తల్లిదండ్రులకు హితవుగా నడువకపోయినా రాధపట్ల స్వార్థత్యాగం చేశాడు ప్రభాకరం.

ము: అవును ఎప్పుడూ అంతే వందలకొలదీ మైళ్ళు ప్రవహించే గోదావరి తత్పరిసరాల కుపయోగపడక వాటిని అరణ్యప్రాంతాలుగా విడిచిపెట్టి ఎడారిగా వుంచి పోవలసిన తదితర ప్రాంతములో ప్రవహించి వాటిని సారవంతం చేస్తోంది. కొండలెక్కి ప్రవహించే శక్తి నదికి లేదు. నదిని లాక్కునే శక్తి కొండలకు లేదు.

ఏం చేస్తాం!

తల్లిప్రేమ నేనెరుగుదును. సర్వకాల సర్వావస్థల యందు సంతానక్షేమంకోసం తన్నుతానే త్యాగానైనా చేయగలదు తల్లి. అందుకని నన్ను నమ్మి వచ్చిన అనాథను విడిచిరావడం ఎట్లా? పోనీ దాన్ని తీసుకు వచ్చి అక్కడే వుంచుదామా అంటే మీలాంటివారికి రాదన్నారు. ఇంక నేను రాను. రాలేను సుబ్బారావు. నువ్వే ఆలోచించూ ఇటువంటి దుస్తరపరిస్థితులలో ఎవరుమాత్రం ఇంతకంటే ఏం చేయగలరు? తల్లిదండ్రులదగ్గర నేమాత్రం వారికిచేసే మహోపకార మేమున్నది! బాబని చెప్పు. అంతే ఇంకేమీ లేదు.

మీనాన్నగారు ఇది కడసారివార్త అని చెప్పమన్నారు, ఇప్పుడు నామాటప్రకారం ప్రభాకరం రాకపోతే అతనికీ నాకూ ఏవిధమైన సంబంధమూ వుండదు. నాకు వాడు పుత్రుడుకాడు. నేను తండ్రిని కాను. వాడికి ఏ రాన్న ప్రాప్తి భిక్షమెత్తుకునేయోగంవుంటే చెప్పలేం. సహించి సహించి ఎంతసహించి నా మనస్సు మార్చుకోలేదు. కడకు కులభ్రష్టత్వానికి ఒప్పుకున్నాడు. ఏదో ఒక టక్కులాడిపై మమకారంచేత జననీజనక దుఃఖకారకుడై శాశ్వతాపకీర్తి తేవడం మంచిదికాదని చెప్పు. వస్తాడా రమ్మను రాకపోతే యీయింటిలో కాలుపెట్టడానికి ఇకముందు, వీలులేదు. నాకు పుట్టలేదనుకుంటాను. ఆస్తిపాసులలో భాగముండదు. సర్వసౌభాగ్యానికి [illegible]ధువు హా

దూరమైపోతాడు. ముందు మోకాళ్ళమీద బుర్ర పెట్టుకొని ఏడ్చేటప్పుడు బోధపడుతుంది. వాళ్ళు నచ్చచెప్పి రమ్మను. రాకపోతే అతడిగొడవ నాకు లేదు. అని చెప్పమన్నారు మీనాన్నగారు కడుపట్టు దలమనిషి ఎందుకు నిర్నిమిత్తాలుగా భవిష్యత్సుఖాలను పోగొట్టుకుంటావు పెండ్లికావలశినవాడవు. ఆయన సంపాదించినదేదో వుంది. హాయిగా తిని కూర్చోవడం నీకు సుఖమనుపించలేదా? ప్రేయసీపిశాచానికి జాలి సుఖాలు బలిచెయ్యకు దీర్ఘాలోచనచేసి యేదో యేర్పాటునకురా; యేర్పాటేమిటి నాతో వచ్చేయి. యీరాధ ఏలాగు చచ్చిపోతుంది పోనీ అంధగాను నీకు ఆశలేదు రెంటికి చెడతావు వుభయభ్రష్టుత్వం పొంది పశ్చాత్తాపానలదగ్ధుడవై నవ్వులాటలోకంలో తన్నివృత్తికొక్క కరుణాశ్రుబిందువుండదు. ఒక్క నిట్టూరుపు వుండదు. అనుభవంలేనివాడవు మేమంతా వివాహితులమై పుత్రకళత్రాదులతో సుఖిస్తోంటే నువ్వు నాస్తికవాడిలా కేవలమోహాంధకారంలో జ్ఞాన జ్యోతిలేక తడుములాడుకుంటున్నావు. నేను స్నేహ భావంతో చెప్పేదీఅదే. దబ్బున నిశ్చితానికివచ్చి నాతో లేదిరా.

తెలివైన వాడివేగాని యవ్వనోద్రేకోన్మాదంచేత విజ్ఞానవిహీనుడవై విర్రవీగుతున్నావు. అవకాశాన్ని జారవిడుచుకుని అవల చింతించి లాభముండదు. శ్రీ

వాడా జీవించని రాధకోసం తదితర సర్వస్వాన్ని పో గొట్టు కుంటావా ? యిదెక్కడ దాపురించింది నీకు ?

వ్రి: విస్తార ప్రస్తావనచేసి నన్ను మోహాంధకారంలోంచి మేలుకొలపకు. ఏదో చెప్పమన్నారు నాన్నగారు చెప్పేవు. నియమితోద్యోగ మయిపోయింది. నాకు నీతిప్రబోధం చెయ్యనక్కరలేదు. నేనురాను. తల్లి దండ్రులైతే మాత్రం ధర్మవిరుద్ధంగా ప్రవర్తించమంటే అనుసరించాలా? వారు నాకేమీ రాయభారాలు పంపనక్కరలేదు. తద్వారము నీవు, వహించనూ కూడదు. తల్లి దుఃఖిస్తుందంటావా అప్పను దుఃఖిస్తుంది. నాకు తల్లిమీద ప్రేమలేదని ఎవరూ చెప్ప గలరు? ఆమె నాకు అనుక్షణారాధ్యదేవత. ఆమెకు నా నమస్కారాలని చెప్పు. తల్లి ఋణం తీర్చుకోలేని అభాగ్యుణ్నేగాని అవిశ్వాసిని కాను. రాధను విడిచి పెట్టడానికి వీలులేదు. విడిచిపెట్టడం జరగదు. విశ్వాసంతో రాధానిమిత్తమే త్యాగానికైనా సంసిద్ధుణ్ణని చెప్పు. వెళ్ళు. ఒక్కమాటాడకు—ఇంకెప్పుడూ రాకు.

అంటే అతడు నిరాశ చేసుకొని చిన్నబుచ్చుకొని వెళ్లిపోయాడు. ఎందుకో యెక్కువ ధైర్యం వహించి నట్లుతోచింది ప్రభాకరం ముఖవైఖరి. ధీరుడు. ఏమంటావు చెల్లాయి ?

అన్నయ్యా, కవిసంభాషణా గాంభీర్యం ప్రశ్నోత్తర పరంపర ప్రావీణ్యం! ఎంత హృదయగమ్యంగా

వున్నయ్! ఆసవాస్వాదనలో తుమ్మెదే అయినప్పటికీ నీతికి నిలబడి నిప్పులాగా ప్రవర్తించాడు రవంత స్వార్థం లేనవ్యక్తికూడా. సగ జీవనాన్ని మృత్యుదేవత కర్పించి చావకూర్చున్న రాధకోసం యావత్సుఖ పరిత్యాగం చేశాడు. తల్లిదండ్రులు, ఆస్తిపాస్తులు, తద్వారా కలిగే సుఖం వివాహం అన్నీ విడిచిపెట్టేడు. చాలయోగ్యుడు. మంచి మనోధైర్యం కలవాడు. మొదట కేవలం దుర్మార్గుడనుకొన్నాను గాని ఇంత ధర్మపరిపాలకుడనుకోలేదన్నయ్యా.

ము: అవునమ్మా! అతనిలో అన్ని సద్గుణాలు వున్నాయి. కాని పాపం, రాధకు కాల మాసన్నమవుచున్నది. ఏడు యెనిమిది నెలలైపోయింది జబ్బు ప్రారంభించి. ఇంకెంత కాలమో జీవించదు. మాటాడలేక పోతుంది. ఒకనాడు ప్రభాకరరావు రాధదగ్గర కూర్చొని ఎలా వుందని ప్రశ్నించగా రాధ—

రా: బాగానేవుంది! మీరలా చిక్కిపోతున్నారేం? ఎందుకలా బెంగపెట్టుకుంటారు అన్నంతింటున్నారా లేదా? ప్రభాకరం మనకు శాశ్వతవియోగం కలుగుతుంది కాబోలు. ఎంత విషాద! నన్ను మర్చిపోతారా శాశ్వతంగా! మీతో సరదాగా గడుపుదామనుకొన్నాను. అనర్హను ఆశపడ్డాను. మహనీయులు మీతో సుఖించే భాగ్యం నాకెలా అబ్బుతుందిలెండి. కొద్ది కాలంలోనే మీ దర్శనంకూడా కలుగదు. మీరు రాధా అని పిలు

వరు. మీ కండ్లకు నేను దూరమయిపోతాను. మీతో నే నుండలేను. నాతో మీరుండరు. దురదృష్టం కాలదేవత కళ్లుకుట్టు కఠిన ప్రేమావసానం కలిపించింది. కాని ప్రభాకరం! నేనుమాత్రం మిమ్మల్ని యీ స్వల్పకాలంలో అనన్యాపేక్షతో పవిత్ర ప్రేమతో ప్రేమించాను అదే నా సంతృప్తి. ఆ సంతృప్తితోనే నేను చచ్చిపోతాను. మీరు నిరుత్సాహ పడకండి. నేను లేని మీరు తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లగలరు. వెళ్లండి వారు మిమ్మల్ని సహిస్తారు. నన్ను మరచిపోండి ప్రభాకరం. పెండ్లి చేసుకోండి. మనకు ఋణం తీరిపోయింది.

అని పొర్లివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చింది. ఆమన స్సెంత కలత పొందిందో ఎవరు చెప్పగలరు? అటువంటి ఘోరవిషాదాశ్రు ధారలు యెన్నో గుర్తించబడకుండా లోకంలో ప్రవహిస్తూనే వున్నాయి. ప్రభాకరం మనస్సు కరిగినీరై పోయింది. అతని కండ్లనుండి రాధ హృదయానలాన్ని చల్లార్చడం కోసం కన్నీరు రాధ వక్షస్థలాన్ని తడుపుతోంది రాధ అతనికన్నీరు తనపైటతో తుడుస్తోంది.

ప్ర: రాధా! నీ కేంకావాలి? నిన్ని బలవన్మరణాన్ని కెరచేసిన నీచుణ్ని నేనే. ఎంత విశాలహృదయం రాధా నీది! నామూలాన్నే నీకీ జబ్బువచ్చింది. ప్రేయసీ ప్రాణధనం కృశించి నశించిపోతోంటె కించిత్తుప కారం చేయలేను. ఘోర పాషాణ హృదయుణ్ణి

ప్రేమించావు. నీమరణాన్ని నువ్వే కోరితెచ్చుకు న్నావు, కొంపగొంపకూ తిరిగే కుటిలుణ్ణి కోరుకు న్నావు ఏం బాగున్నావు సరే, అదంతా అయిపో యిందిరాధా. నీతల్లిదండ్రులకు వార్త పంపనా? వారిని చూస్తావా? పాపం వాళ్ళదగ్గరుంటే డబ్బు ఖర్చుపెట్టి నిన్ను బ్రతికించుకోరా? అభాగ్యుణ్ణి యేదీ చేయలేను. చేయకలిగినంతమట్టుకు మిత్రసహాయం చేత చేస్తూనేవున్నాను. క్షమించు రాధా.

అనికన్నీరుకారుస్తూ ఆమెమీద వాలిపోయాడు. రాధ అతని తల నిమురుతూ బిగియార కౌగలించు కొంది. ప్రేయసీ ప్రియాశ్రుప్రవాహంతో పరుపు తడిసిపోయింది. రెండుహృదయాలకు ఆకర్షణ శక్తి వుంది. ఒకహృదయంలోని ఆవేదన రెండవహృదయం గ్రహించి పాలుపంచుకుంటుంది. సంతోషమైనా అంతే. అన్నింటిలోనూ అన్యోన్యస్వీకారం వుంటుంది పరస్పరత్యాగం చేస్తాయి, అనుకూలతేగాని ప్రతి కూలత వుండదు అదే ప్రేమ.

రా: ఏడవకండి ప్రభాకరం! నాకు మీరే సర్వం తల్లిదండ్రులా? వున్నా, లేకపోయినా ఒకటే, వారికి వార్తపంపవద్దు. జననీజనకులుకాదు సంఘోల్లంఘన చేయలేక పవిత్రప్రేమాస్పదులమైన మన ఇరువుర్ని బహిష్కరించిన పిరికివారు. ఇంతబాధకూ వారే కారకులు, ఎవ్వరూవద్దు. మీరున్నారుగా. నామరణపరి

యంతం మీారు నిరంతరసాన్నిధ్యాన్నిస్తూ దయా దృష్టులు నాపై నిలుపుతే చాలును. యీ విశాల సర్వ ప్రపంచంలో నాకంతకన్న ఏమీ కోరిక లేదు. ధైర్యం వహించండి. ధైర్యముండాలి. ధర్మార్థం ప్రాణపరిత్యా గానికైనా వొప్పుకోవాలి. మరణం తప్పదెప్పటికైనా వారిని జీవించనివ్వండి మతోన్మాదులు అస్వతంత్రులు కలకాలం బ్రతకనివ్వండి. యెంతకాలం బ్రతికినా వారు నావలె సంతృప్తితో చచ్చిపోలేరు. అని ధైర్యం వహించి యేడుస్తూ కష్టంమీాద కడసారిమాటలు చెప్పింది రాధ. ఇక ప్రయత్నించినా మాట్లాడలేక పోయింది. జబ్బుకాదు పాపం! అదేమిటి చెల్లాయీ కళ్లమ్మట నీళ్లొస్తున్నాయెందుకు? రాధ చచ్చి పోవడంలేదు. ప్రభాకరం ఏడవడమూ లేదు. ఏమిటా మనోభ్రమ పిచ్చిదానా కథావిషాధానికే కలతపడితే యెట్లా? మరి అవన్నీ అనుభవించిన వారెంత బాధపడాలో అని నిట్టూర్చాడు కథచెప్పుతూన్న ముకుందరావు.

లీ: ఏడవడంలేదు కాని అన్నయ్యా రాధా ప్రభాకరం యెంత బాధపడ్డారో యెంత యేడ్చారో యెవరికి తెలు స్తుంది. అని దీర్ఘంగా నిట్టూర్చింది. కంఠతడి చీర చెంగుతో తుడుచుకుంటూ.

ము: నిజమే చెల్లాయీ! అని విచారాన్ని సూచించాడు ఆలోచనా నిమీాలిత నేత్రాలతో—

లీ: అన్నయ్యా! ఇది కథ కాదు యదార్థమన్నావు ఆ ప్రభా

కరాన్ని నీవు యెరుగుదువా?

ము: యెరుగుదును.

లీ: ఇప్పుడెక్కడ వున్నాడు?

ము: వున్నాడులే.

లీ: రాధచచ్చిపోయిందా పాపం?

ము: క్రమక్రమేణా అవసానకాల మాసన్నమైంది. ప్రపంచం సమరచి నిద్ర పోతోంది, అది ఒకనాటికాలరాత్రి. రాధకు మాటలేదు నోటనేమీ చెప్పలేదు ఔషధ ప్రయోగంవల్ల లాభంలేదు. కంటచూపున్నది గాని కన్నీళ్లు తేలిపోతున్నాయి, రాధ మంచంమీద ప్రభాకరం వున్నాడు. ఆప్రక్కనే కుర్చీలో రామా రావున్నాడు. రాజ్యం ఆమంచంమీదనే కూర్చుని పాలుపోస్తోంది గొంతుకలో. పాలుమ్రింగలేదు రాధ. ఆకన్నులు మంచంచుట్టూ ఏదో వెతుక్కుంటూ చూస్తున్నాయి. కడకు ప్రభాకరం ముఖవీక్షణం చేస్తూ నిలిచిపోయాయి. హస్తద్వయం కంఠంమీద దగ్గరకు చేరుకొని నమస్కారంలా కనుపించింది. 'సర్వప్రపంచం నన్నే నమ్మి నాకోసం తుదిఘడియ వరకుకష్టపడిన ప్రభాకరం నమస్కారం. దుఃఖమంటే తెలియని నిన్ను దుఃఖపెట్టినందుకు నన్ను క్షమించు. ఇక నీతో సుఖించలేను. నీవుజీవించిలో కానికికమ్మనమనసకలను చీల్చి సరియైనదృష్టిని ప్రసాదించు. ఆదర్శపురుషుడవు. కాలాతీతమైపోతోంది వేరొక్కక్షణం గణించుకోలేని

అబలను నాకోసం విచారించకు ధైర్యపడు. విచారించి ఏంచేస్తావు నీకు దురవస్థ వాటిల్లింది. కాని య్యి నీసద్గుణబలంచేత నీకు సర్వావస్థా నివృత్తి కలుగుతుంది. నిన్ను మీ చెల్లాయి రాజ్యం కడుపులో పెట్టుకుంటుంది. ఆమెకు నేను కృతజ్ఞురాలను. స్నేహితునితో చెల్లాయితో కలసి నన్ను మరచిపో. వారు పుణ్యదంపతులు పవిత్రహృదయులు మరణాహ్వానం స్వీకరిస్తున్నాను కడసారం' అని కన్నులు చెప్పాయి.

"శెలవు ప్రభాకరం నీకు సేవచేసేభాగ్యంపోగా నీవే నాకు సేవ చేశావు నాహృదయచిత్రాన్ని నీ హృదయంలో కలుపుకో. తడవులేదు' అని ముకుళిత హస్తద్వయం నమస్కరించింది. రాధా ప్రాణం బలవంతంగా అగమ్యస్థలాలకు కొంపోబడింది. ప్రభాకరం తనకు మిగిలిన ఒక్కనిట్టూర్పు విడిచిపెట్టేశాడు. రాధకేసి చూస్తున్నాడు. శవంకేసి చూస్తున్నాడు. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. రాధలేదు. తాను ప్రేమించి ముద్దించి శృంగారచేష్టల నోలలాడించి రాధకాదు. నిర్జీవపదార్థం. హేయము గర్హనీయము అయిన మృతజీవి కళావిహీనము నిశ్చేష్టము దుర్గంధ భూయిష్ఠం ఏమయింది రాధ? ఏమో! అనూహ్యాంతరిక్షాలలోని కెగశిపోయిందా? ఏమో? పరలోక ప్రాప్తి పొందిందా? తెలియదు పిశాచమై గాలిలో తిరుగుతోందా ఎవరికి తెలుసు? నిష్ఫలకాంక్షాపేక్ష

న్మాదంతో దెయ్యమై ప్రజలను బాధపెడుతోందా? అదీ తెలియదు. అదే యెందరెందరో సర్వపూర్వాధునిక శాస్త్రపారంగతులు వేదాంతులుకలసి కనుక్కోలేని విషయం మరణానంతరావస్థ నెవరెరుంగుదురు? ఎరుగుదు మనుకొనేవారేకాని ఎరిగినవారెవ్వరూ లేరు. సరేఏమయితేనేమిటి రాధలేదు. ఏంచేస్తాడు ప్రభాకరం? జీవనాధారంపోయింది. ప్రేమపుష్పం వికసించ మధుపరిమళ సౌభాగ్యాన్నిచ్చి భీకరరుజాతీక్ష్ణ సంక్షుభితమై వాడిదళశోభకోల్పోయి దినదినక్షీణమై భూపతనం పొందింది. ప్రభాకరం నిరాశాంధకారాంతర్యామియై కోరికలుచంపుకొని వెనుక భాగాన్ని మరచి ముందుకుపోయే యోధునివలె ధైర్య మవలంబించి ఒక నిశ్చితాభిప్రాయానికివచ్చేడు. రాధా దహనాది సర్వోచితక్రియలు జరిగిపోయాయి. మరునాడు వారు స్నానము అవీచేసి యింటికి వచ్చేటప్పటికి పదయింది. ప్రభాకరుడు ప్రభాకరంపై తీక్ష్ణకిరణాలను విసురుతూరోజూకన్న వుష్ణోకరుడై మండిపడిపోతున్నాడు. ఇంటిదగ్గర రాజ్యం కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తూ అప్రియత్నంగాదృష్టిని అవుషధాలున్న బీరువాపైకి పోనిచ్చింది. ఒక వింత రంగు మందుతో ఒకసీసా కనుపించింది. అది ఏమిటోనని వెళ్ళిచూసింది. అదిరాధ అవుషధాలకుసంబంధించనిది. ఇదివరకు లేనిది ఏమిటని ఆలోచించింది. ఇది

నిన్నటి వరకూ ఇక్కడలేదే? ఒకవేళ విషమూ, విషమే విష మిక్కడ కెందుకువచ్చింది. అన్నయ్య తెచ్చి వుంటాడు. ఎందుకోసం? ఇంకెందుకూ తన ప్రాణధనం రాధ పోయిందని తనూ తన్మార్గానలంబి యైపోవ డానికి. ఎంత సాహసము. అన్నయ్య చచ్చిపోతాడా? అందుకేనా అంత ధైర్యంతో నున్నాడు. అన్నయ్య చచ్చిపోతే మేమ్మాత్రం జీవించగలమా? నిర్మల హృదయుడు. నన్ను ఎంత గారాబంగా చూస్తాడు. స్నేహితునితోనైనా విసుగుచెందుతాడు గాని నా తో ఎంతో నెమ్మదిగా మాట్లాడుతాడు. ఒకవేళ యీ విషం పారబోస్తే మాత్రం మళ్లీ తెచ్చుకో లేడా? మరొక ప్రియత్నం చేయలేడా? ఎంత ప్రమా దం వాటిల్లబోతున్నాది! యీ దారుణాత్మహత్యా ప్రయత్నంనుంచి అన్నయ్య నెట్లాగైనా తప్పించుకో వాలి. నావల్లాతనికీమాత్రమైన ప్రయోజనం లేనప్పుడుకూడా ప్రతిఫలాపేక్షా రహితమైన దాక్షి ణ్యముతో అతడు నన్ను చూస్తాడు ఆతనికి నే నెంత పరిచర్యచేస్తే ఋణం తీరుతుంది అని రాజ్యం విష మున్న సీసా బైటకు విసరికొట్టి లోలోన ఆలోచించు కుంటుండగా రామారావు ప్రభాకరావు ప్రవేశించి మౌనంగా కూర్చున్నారు. చేతనైనంత మట్టుకు రామారావు దుఃఖోపశమనం చేస్తూనే వున్నాడు. ప్రభాకరావు ధైర్యంగానే వున్నాడు. పగలు గతిం చింది: రాత్రి పది దాటింది. అంతా వుండుకున్నారు.

రాజ్యానికి మాత్రం నిద్రపట్టలేదు. విషం పారబోశా
నన్న ధైర్యంతో ఇంకా ప్రభాకరం ఏ సాహసం
చేస్తాడోనని మెలుకువగా నేవుంది ప్రభాకరావు
కసలే నిద్రలేదు. అందులో ఆశ్చర్యమూలేదు. అత
నిలో రెండు ఆలోచనలకు (ఆశకు నిరాశకు) తీవ్ర
సంఘర్షణ జరుగుతోంది.

నిరాశ: ప్రభాకరం! నిష్కారణంగా యువతి యుసురు పోసు
కున్నావు దుర్మార్గుడా? ముద్దు ముచ్చటలు తీరని
రాధను దొంగతనంగా సాధించి అంతటితో విడువక
శాశ్వతంగా అనుభవిద్దామనుకున్నావు. ఎంత సాహ
సానికి వొడికట్టుకున్నావు!

ఆశ: నేనేంపాపం చేయలేదే! వలచి వచ్చిన రాధను సం
ధించిన మాట వాస్తవమే. తత్కారణంగానే యీ
విషాద మరణం తప్పలేదు. నేను మొదట వొద్దని
రాధకు చెప్పలేదా? నా తప్పేముంది? కడ ఘడియ
వరకూ యావచ్ఛక్తి వినియోగించి సేవ చేయలేదా?
ఏమయినా నిరాదరించానా? రోగపీడితయై చనిపో
యింది. దానికి నేనే బాధ్యుడనా?

నిరాశ: వలచి వచ్చిందంటున్నావా? చండాలుడా! యవ్వనో
ద్రేకంలో ఎట్టి స్త్రీకి అమాత్రం మనశ్చాంచల్యం వుం
డకపోదు. అట్టి సమయాల్లో పురుషులు తప్పించుక
పోవాలి, అలాచేయక ఆమె యవ్వన జనిత కాంక్ష
లను ద్విగుణీకృతంచేసి గదికి రప్పించుకుంటావా? ఛీ
నీముఖం చూడగూడదు. కొసవరకూ సాయంచేశా

వూ? మొదట నీ విజ్ఞాన మేమయిపోయింది. స్నేహితులతో పెద్దకబుర్లు చెబుతావా? కార్యం వచ్చినప్పుడు కండ్లు మూసుకుపోయి మోహాంధకారంలో నిలువునా నిండుప్రాణాన్ని తీసి నిర్విచారంగా వుండుకున్నావా? ఎంత చింతించిందో ఎంత బాధపడిందో గదా రాధ. పాపం అమాయకురాలు సద్గుణశీల అంచాతనే నీలాంటి రోగితో దుర్బలునితో ఆగకాయతో సహవాసాని కొప్పుకొని విశ్వాసంతో ప్రవర్తించింది. అవిశ్వాసి! మొదట గర్భం దాల్చినప్పుడే విడిచిపెడితే ఏమో ఏమవునో! తదుపరి చక్కని మగని పెండ్లాడి పుట్టినింటికీ మెట్టినింటికీ ఎంత సంతతదాయిగా నుండునో! మాయలెరుగని దానికి మర్మాలు నేర్పి దానికర్మం అలావుందని తృప్తిపడుతున్నావా? నీకోసం రాత్రింబగళ్లు అలమటించి తుది జీవితక్షణాంతవరకూ నిన్నే స్మరించిన రాధమీద నీకు సానుభూతి లేదా? వృధాగా కబుర్లుచెప్పి స్నేహితులను పరిచితులనూ మోసగించి తెలివిగలవాడనను పించుకుంటున్నావు. పవిత్ర ప్రేమకోసం ప్రాణాలు అర్పించాలని వుపన్యసిస్తావు. ఆచరణలో పెట్టలేవు. అధమా ప్రణయాక్షరాభ్యాసం లేని రాధ ప్రథమ యవ్వనాన్ని సంపూర్తిగా అనుభవించి ఆమెను కఠోరకంటక రుజాగ్రసను చేసి చంపి సుఖిస్తున్నావా? వ్యర్థ ప్రలాపీ! నిరర్థకంగా ఎన్నిసార్లు 'రాధా నిన్ను మనస్పూర్తిగా ప్రేమిస్తున్నా'నని చెప్పేవు. నీకు మనస్సున్నదా? వుం

టే అది పాషాణమై యుండాలి. కాలక్షేపంకోసం చూస్తావు. ఆ తల్లిదండ్రులెంత యేడుస్తున్నారో! తల్లికీ బిడ్డకూ ఎడబాటు జేసిన నువ్వు మాత్రం యేం సుఖిస్తావు. ఉట్టిగట్టుకు ఊగుతావా! చూడు రాధ 'మీరు జీవించండి ధైర్యపడండి' అన్నంత మాత్రంచేత తద్వచనాంతరార్థాన్ని గ్రహించలేక మొండికత్తి జీవిస్తున్నవా! భావకవీ! సిగ్గులేదూ?

ఆశే: లేదు దాని కంతరార్థం లేదు. 'భయపడకండి మీరు చనిపోవద్దు. మనోవైకల్యాన్ని పొంది ఆత్మహత్య చేసుకుంటే ఎవ్వరూ హర్షించరు. లోకాదర్శంగా జీవించండి. తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళండి' అని రాధ చెప్పిన మాటలు మనస్ఫూర్తిగా చెప్పినవే. నావి స్వార్థ ప్రలాపాలు కావు. నేనేం చెయ్యగలనూ! రాధకు కొంతవరకూ చెప్పాను. కాని రాధ వినలేదు. దుర్మార్గంగా నేరాధా ప్రేరేపితుణ్నై ఆపని మానలేకపోయాను. అయితేమాత్రం ద్రోహం చెయ్యలేదే. రాధ జీవించిఉంటే కళ్ళల్లో పెట్టుకొని చూడనా? విడిచిపెడుదునా తలిదండ్రులను విడిచిపెట్టమని నేను చెప్పానా వారెందుకు విడిచిపెట్టేరూ? ఆతప్పు నాదేనా? రాధది నిర్మలమైన ప్రేమ. రాధమీద నాకుమాత్రం ప్రేమ లేదా? యీ క్షణంవరకూ రాధకోసం యేమైనా చేయగలను. సుఖానుభవం మాత్రమేకాదు. ప్రాణాలు నిజంగా అర్పించగలను. కాని దానివల్ల ఒరిగేదేమిటి! నా ప్రాణాన్ని బలిగా తీసుకొని

తద్వారా రాధ జీవిస్తుందా? రాధ ఎటూ చనిపో యింది. ఇప్పుడు ఆత్మహత్యవలన ప్రయోజన మేము న్నది. నా అవిశ్వాస మేమిటి?

నిరాశ: ఏమిటా? కామాంధకారా పటలాలలో కండ్లుగానక గవాక్షంబంధించి సర్వాంగాంకుర నవయవ్వనవిలాసిని విగతవస్త్రను జేసి శృంగార కేళీ పరిసక్తిలో కాలం వెళ్లబుచ్చిత రాధ ప్రాణం విడిచినప్పుడు నీచా, నీ కోసం ప్రాణ మర్పించినప్పుడు ఇంకా జీవిస్తున్నావా? 'రుగ్మతాక్లిష్టమైన నీ రక్తమే రాధ మరణానికి దారుణ కారణమని ఇంకా వూహించుకోలేదా? సర్వావయ వ్యాప్తదుష్టరుధిరంతో రాధను మృత్యువుకు బలి యిచ్చి నేను బాధ్యుడను కానంటావా ? ఎందుకు చచ్చిపోయింది? వ్యభిచారీ! విషం తెచ్చి ఇంట్లో పెట్టు కొని మళ్లీ మనస్సు మార్చుకొని జీవిద్దామనుకొంటు న్నావా? పిరికిపందా! నీచిత్తం క్షణక్షణం. స్త్రీల చిత్తాలు క్షణక్షణాలని చంచలానివారు విజ్ఞానం లేనివారనీ స్వార్థపరులనీ చెప్పేవు. చూశావా? ఒక స్త్రీమూర్తి ఎంత త్యాగంచేసి స్వార్థరహితంగా ప్రా ణం విడిచిపెట్టిందో? నీర్చుకో ప్రేమపాఠం. ప్రేమ లేదన్నావు ప్రపంచంలో.

ఆశ: అవును నిజమే! ప్రేమపాఠం నేర్పింది. ప్రాణ పరిత్యా గం చేసింది. విషం తెచ్చిపెట్టేను. పిరికిపందను కాను. చచ్చిపోగలను. నిస్సందేహంగా చచ్చిపోతాను జీవ నావకాశం లేని నేను చచ్చిపోక చేసేదేమున్నది?

నిరాశ: చచ్చిపో! లే రాధప్రాణాన్ని తీశావు. తన్నిమిత్తం నీ ప్రాణం అర్పించడానికి ఇంత ఆలోచన యెందుకు?

ఆశ: ధైర్యంగా చచ్చిపోగలను. రాధను బ్రతికించుకోలేని హీనుడను, నేనుమాత్రం యెట్లా బ్రతుకగలను అని ప్రభాకర్రావు లోని ఆశానిరాశల సంఘర్షణల్లో ఆశ వీగిపోయింది. నిరాశ జయించింది. లేచికూర్చున్నాడు ప్రభాకర్రావు. మహా నిశీధసమయం. రామారావు కొంచెం మగతనిద్రలో వున్నాడు. రాజ్యానికి నిద్ర లేదని చెప్పను చీమ చిటుక్కుమంటే లేచి చూస్తోంది ప్రభాకరం లేచి కూర్చోవడం చూసింది. కాని విషం లేదనే ధైర్యంచేత అలాగే తెలివిగా కండుకొంది.

నిరాశ: ఇంకా ఆలోచనేనా? గౌరవప్రదంగా మరణించడం కన్న కావలసినదేవుంది. గౌరవకారణం కోసం, రాధా ప్రేమకోసం, ప్రభాకరం లే చచ్చిపో! ప్రపంచం చీకటి. నీ జ్యోతిలేదు. నీకేముంది? నిర్ధనుడవు. ధనమేవుంటే తగిన చికిత్సానంరక్షణ చేయించుకొని రాధకు క్షయ జబ్బు రాకుండానే కాపాడుకోగలుగుదువు. అని అనిపించగానే తృళ్ళిపడి లేచి దబ్బున బీరువా దగ్గరకు వెళ్ళి చూశాడు విషంలేదు. ఏమయింది? ఏమో సరే తదితర ప్రాణపరిత్యాగోపాయాన్వేషినై పోవడాని కుప క్రమించి కృత్రిమంగా నిద్రిస్తోన్న రాజ్యం కాళ్ళ దగ్గరకు వచ్చి "చెల్లాయీ యీ మన్మాత్రిమనో భేదం లేకుండా నాకు రాధకూ, నిష్కామంగా సేవచేసిన సిబ్బులం తీర్చుకోలేను. స్నేహితునికన్న మిన్నగానా

కష్టాలుపంచుకోని బహిష్కృతిని లెక్కించకుండా నా దగ్గరకువచ్చి పాయపడిన నీ ప్రేమకు ప్రతిఫలంలేదు. నీకూ నాకూ మధ్యనున్న సోదర సోదరీ వాత్సల్యం సమాప్తమయిపోతోంది. ఋణం తీరిపోయింది. చెల్లాయీ నన్ను క్షమించు" అని మనస్సులో అనుకొని రాజ్యం కోమలపదపల్లవాలకు నమస్కరించడానికి వంగేడు. అశ్రువులు కాళ్ళపై జలజలారాలేయి ఆమె నిశ్చబ్దంగా అశ్రువులతో పరుపు తడుపుతూ ఇంకా ఏంచేస్తాడో చూదామని వూరుకుంది. పైకి లేచాడు. రామారావును తేరిపారచూచి చేతులు జోడించి నమస్కరించాడు. అయిదు నిమిషాలవరకూ అతన్నిచూస్తూ బాల్యస్నేహంకాబట్టి వారివుభయుల మధ్యావున్న సర్వసహవాససంబంధ బాంధవ్యపాశాలు తెంచుకొని కన్నీరుకారుస్తూ ధైర్యంగా వెనుదిరిగి సన్యసించబోయే బుద్ధునివలె ప్రభాకరం తలుపుతీసి మరణాభిముఖంగా పోబోతాడు. ఈ లోపున రాజ్యంలేచి అతనిచెయ్యి పట్టుకుని లోపలకు తీసుకొని వచ్చి తలుపు గడియవేసి 'ఏమిటిది అన్నయ్యా' అని కెవ్వునయేడ్చింది. రామారావు కంగారుగాలేచి 'ఏమిటిది రాజ్యం' అని ప్రశ్నించాడు. రాజ్యం కంగారుగా అన్నయ్య ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు, చిన్న విషం తెచ్చి బీరువాలో పెట్టేడు. అని ప్రభాకరం కళ్ళల్లోకిచూస్తూ అన్నయ్యా నామీద నీకు ప్రేమ లేదా! నాకోసం జీవించకూడదా! నువ్వు చచ్చిపోతే

నేనూ చచ్చిపోతాను. నా మాటవిను. ఆ ప్రయత్నం హృదయపూర్వకంగా మాని నాదగ్గర వుండు. అని అతని కాళ్లమీద పడి ప్రార్థించింది. రామారావు జాలిహృదయం పాపం కన్నీరుకారుస్తూ కంఠశోషతో మాట్లాడలేకపోయాడు. ప్రభాకరం తన కాళ్లమీద నున్న రాజ్యాన్ని 'లే చెల్లాయీ' అని చెయ్యి పట్టుకున్నాడు.

రాజ్యం: లేవను నా ప్రశ్నలకు జవాబు చెప్పా లేస్తాను. చచ్చిపోవు గాదూ?

ప్ర: చచ్చిపోను. అన్నాడు పొరలివచ్చే దుఃఖాన్తో పూడుపోయిన గొంతుకతో.

రాజ్యం: నామీద ఒట్టను.

ప్ర: అల్లాగే చెల్లాయీ లే.

రాజ్యం: ఎక్కడికీ వెళ్లిపోకుండా నా దగ్గరే వుంటావా?

ప్ర: అల్లాగే నమ్మూ! లే. అని చెయ్యి పట్టుకొని లేవదీశాడు. రామారావు 'తప్పు ప్రభాకరం చనిపోయి ఏంచేస్తాం మనం లోకంలో చేయవలసిన పనులు చాలా వున్నాయి. నువ్వు లేకపోతే నాకుమాత్రం ఎవరున్నారు? మీ చెల్లాయి చూడు ఎంత ఏడుస్తుందో! విషంకూడా తెచ్చావు! మంచివాడవే! అని మందలించాడు.

రాజ్యం: అవునండీ నేనే పారపోశాను మధ్యాహ్నం.

రామా: మంచివాడవే! అంత అధైర్యపడితే ఎట్లా? మా ఇంట్లో వుండు. నీకేం లోటు? మీ చెల్లాయి నిన్ను

కళ్లలో పెట్టుకుంటుంది. అని చెప్పుతోన్నంతసేపు రాజ్యం ప్రభాకరం చెయ్యి పట్టుకునేవుంది.

లీ: ఇక చచ్చిపోలేదా అన్నయ్యా!

ము: లేదు ఆ క్షణంలో ఆ మనిషికి కలిగిన కోరిక. కాటం కం కలిగిస్తే మరుక్షణంలో ప్రాణం మారిపోతుంది. అప్పుడతని కా ఆటంకమే కలుగకపోతే అతని చావు నిశ్చయం. అలాంటి ఆటంకం కలుగకుండా వుండడం కోసమే బుద్ధుడు తన కుమారుని ముద్దుపెట్టుకుందా మనే కోర్కెను నిరోధించి పురోగమించాడు. వుద్రే కంతో కలిగే హృదయవాంఛ తాత్కాలికం చెల్లాయీ.

లీ: అయిపోయిందా కథ. రాజ్యం ఎంత పట్టుదలగల మనిషి. కొనియాడతగిన గుణాలు మచ్చలేనిమనస్సు ఆ అమ్మాయిమూలాన్నే ప్రభాకరం జీవించాడు. ఏమే అన్నయ్యా అంతేనా!

ము: అవును తన అనురాగంఅంతులేనిది. చూశావా! ఆమె హృదయమెంత వుదారమైనదో ప్రభాకరం జీవితంలో మార్పు తీసుకురా గలిగింది.

లీ: అన్నయ్యా ఇప్పుడు ప్రభాకరం ఏం చేస్తున్నాడు? వున్నాడా?

ము: వున్నాడు లేకేం వాళ చెల్లాయితో కథలూ, కబుర్లు చెప్పుకుంటున్నాడు. నేను మా చెల్లాయితో చెప్పు కుంటూ వున్నట్టే.

లీ: అయితే అన్నయ్యా అతనిప్పు డున్నాడన్నావు. అతని తలిదండ్రులెప్పుడతని చేరదీయలేదా? అలా కాని పక్షాన్ని వాళ్ల చెల్లాయిదగ్గరే వుంటున్నాడా?

ము: అవును. రాధ మరణించిన కొంత కాలంవరకూ ప్రభాకరం వాళ్ల చెల్లాయినద్దనే వున్నాడు. తల్లిదండ్రుల తలంపు అతనికి లేదు. తండ్రికీ తలంపు లేదు. తల్లి కుంటుందనుకో ఏం ప్రయోజనం?

లీ: అన్నయ్యా ఎందుకో ఆ ప్రభాకరం నీలాంటివాడే ననుపిస్తోంది. నాకు. నీ గుణాలు ముఖ్యంగా అతనిలో వున్నాయి. నువ్వూ అందరితో నాన్నగారితో వారితో. దెబ్బలాడుతావు. కాదుమరి.

ము: ఓహో! అయితే నాకుకూడా త్రాగుడు వ్యభిచారం మొదలైన దురలవాట్లన్నీ వున్నాయంటావా ఏమిటి? అన్నయ్యా కథ చెప్పూ అంటేచెప్పేను కాని నన్నా పొగరుమోతు కథానాయకునితో పోలుస్తావనుకో లేదు.

లీ: కాదన్నాయ్యా! అతడు అసాధారణ మానవుడని అతనిలోని గుణాలు నీకూ వున్నాయని పోల్చేను. అంది

(అన్నయ్యకా దురలవాట్లు వున్నాయని తెలుసును గనుక.)

ము: పోనీ రాధ యెవరిలాంటిదంటావు?

లీ: రాధకు పోలిక లేదు. ఆమె అసామాన్యవనితా శిరోమణి. త్యాగాభరణా లంకృతాంగి. ఆమె కామెయే పోలిక.

ము: అవునులే. అన్నాడు విచారసూచకంగా నిట్టూరుస్తూ. మరి రాజ్యలక్ష్మి నీవా ?

లీ: అబ్బో! నాకూ రాజ్యానికి పోలికా? నాలాంటివాళ్లు ఆ అమ్మాయి శేవచేస్తే అబ్బుతాయి అటువంటి మంచి గుణాలు. కథలోని కడపటిభాగమంతా ఆ అమ్మాయి సద్గుణాలు మీాదనేగదా ఆధారపడివుంది.

అని యీావిధంగా ముకుందరావు చెల్లెకి కథలు, కబుర్లు చెఫుతూ ఇంగ్లీషు నేర్పుతూ కాలక్షేపం చేస్తున్నాడు. తరువాత ఒకరోజున ముకుందరావు సాయంకాలం ఇంటివద్ద పూలమొక్కలలో కూర్చుని ఏదో దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు. సూర్యుడు శేషార్ధభాగానికి పోతూ చిత్రవిచిత్రమైన అలంకారాలతో పడమటి భవనాలలో ముస్తాబవుతున్నాడు, అప్పటికి తన విధి పూర్తిగా నిర్వర్తించానన్న గర్వంతో. సూర్యోదయ సూర్యాస్తమయ మధ్యభాగాన్ని. మాన్య మరణం. పురదహనం కూడా ఎరుగక అడవులలో ఆవులను మేపుకుంటూ పచ్చికలలో ఆడుకొనే గోపాలకులు శ్రీకృష్ణుడు రాధా ప్రేమగీతాలు పాడుకుంటూ ఇంటికి మరలినట్టు కవుల కాహారము విద్యాధికులకు వ్యాపారము కలవుతున్నారు. సూర్యునిపోకడ చంద్రుని రాకడ మధ్య భాగమందు అవసర పదార్థాలు అనవసరంగా కూర్చుకునేవారు మావలె సౌఖ్యంగా వుండలేరని జంటజంటలుగా వెక్కిరించుకుంటూ పో

తున్నాయి పక్షులు. చల్లనిగాలి రావోయీ చంద
మామా అని పాడుకుంటూ అతని రాకను నూతన
దంపతులు కందరకూ తెలియజేస్తూ పోతోంది. ఎంత
శక్తివంతుడైనా, తీక్షణంగా ప్రకాశించినా కొత్త
కారువారు అంతా మదాగమనమే వేచియుంటారు
గాని సూర్యుని లెఖ్ఖచేయరని గర్వంగా ముందు చల్ల
దనాన్ని తరువాత తారకాసైన్యాన్ని తదుపరి విపాం
డుర చ్ఛాయలను విడిచిపెడుతున్నాడు ప్రణయిణీమణీ
హృదయాకర్షణీయంగా శశాంకుడు. మనవాడు కుర్చీ
లో కూర్చున్నాడు. అతనికి చంద్రుడు వస్తున్నాడు.
సూర్యుడు పోతున్నాడనే చింతలేదు. ఏది ఎలా మా
ర్పు చెయ్యాలి అనే ఆలోచనే. పాపం మంచి ఆలో
చనే గాని అంధకారావృతమైన ప్రపంచంలో అంత
దబ్బున విజ్ఞానానికి సావకాశముండదు. అతని చెల్లెలు
తెల్లని ఖద్దరు జాకెట్టు మల్లెపూలు శింధూర తిలకం.
ముద్దులైన జాతీయ వస్త్రప్రదర్శన లీలతో ప్రత్యక్ష
మయింది. చేతిలో ఒక గ్లాసుడు చల్లని మంచినీరు
తీసుకువచ్చింది.

లీ: మంచినీళ్లన్నయ్యా!

ము: నేను కావాలనలేదేమో?

లీ: అనలేదు కూజాలోనివి, పారబోసేస్తున్నాము కూజా
కడిగి మరి రేపటిదాకా వుండవు యింత చల్లనినీళ్లు.

ము: మరి నాకు దాహంలేదు?

లీ: తాగుదూ సీతో టంతా పేచీ

ము: నాదా పేచీ? దాహంలేందే తెచ్చి తాగమనడంనీదా!

లీ: పారబో శెయ్యనా? అంది సిగ్గుతో .

ము: అక్కర లేదు, నే తాగుతాను. అని అందుకొని తా గేడు, అక్కర లేకపోయినా.

ము: కూర్చో చెల్లాయీ! యీ వేళ నాకు కొంచెం పని వుందమ్మా వెళ్లాలి, తొందరగా వడ్డిస్తావా?

లీ: ఎక్కడ?

ము: క్లబ్బులో.

లీల తొందరగా వడ్డించింది. భోజనానంతరం ముకుంద రావు వెళ్లి పోయాడు. ఆ పోవడంపోవడం ఇదివరకు పరిచయమున్న ఒక వేశ్యయింటికి వెళ్ళేడు. అతడు వెళ్ళేటప్పటికి సాహాసమనే వేశ్య కులసహజంగా వృత్తి ధర్మంగా అలంకరించుకొని నిలబడివుంది ఆమె ముకుంద రావును చూసీచూడ్డంతోనే మందహాసంతో ఆహ్వానించింది. ప్రతీసానికి అసలు పేరు కాక వేరొక నామకరణం చేస్తూంటారు సరసులు. యీమెకూడా అవిధంగానే సాహసమైందో ఏంటో మనకు తెలియదు.

సా: ఏం బొత్తిగా రావడం మానేశారు!

ము: వూరికే.

సా: వూళ్ళో లేరా?

ము: వూళ్ళోనేవున్నాను.

సా: వూళ్లోవుండీ కనపడకపోవడానికి కారణం?

ము: నువ్వు జడ్జిగారిలాగ అడుగుతే చెప్పుకోవద్దూ మరి, కొంచెం జ్వరపడ్డాను. ఎక్కడికీ కదలడంలేదు.

సా: జ్వరపడ్డారా? అయ్యో తెలియలేదు. తెలిస్తేమాత్రం చూట్టానికి రానిస్తారా మాబోటి సానుల్ని మీ యిండ్లకు?

ము: ఆహా దానికేం. నీకు దాక్షిణ్యంలేక రాలేదుకాని. మీ అమ్మేదీ?

సా: ఇంట్లో వుందండి. మీ వంట్లో బాగుందా! (నవ్వుతూ) ఉండండి యీ వేళకి. ఏం వుంటారా?

ము: వుండమంటావా? ఏం ప్రోగ్రాంలేదా యీ వేళ?

సా: వుంటేమాత్రం మీకంటేనా? వుండండి. మళ్ళీ ఏవరన్నా వచ్చి Book చేస్తారు. వుండండి. మా అమ్మ వస్తోంది. అని చెయ్యిపట్టుకుని ఆశగా అడిగింది.

ము: వుంటానుగాని డబ్బు తేలేదు. మరి మీ అమ్మ వొప్పుకోదేమో? అదికాకపోయినా నేను పన్నెండు ఘంటలకల్లా వెళ్ళిపోవాలి. అంటే సాహసం వాళ్ళ అమ్మదగ్గరకు పరుగెత్తుకు వెళ్ళింది,

వే:మా: ఏమిటే ఎవరో వచ్చినట్లున్నారు?

సా: అవునేఅమ్మా. ముకుందరావుగారు ఈ వేళ వుంటారట.

వే:మా: వుండమను.

సా: ఆయన ఇక్కడకని రాలేదటే పాపం. వూరికే యీ దారినిపోతూ మనల్ని చూసిపోదామని వచ్చేరట.

వే:మా: అయితే ఏమంటావు యిప్పుడు?

సా: డబ్బు తేలేదట నీతో చెప్పమన్నారు.

వే:మా: డబ్బులేని బేరమా? పొమ్మను మంచిసరసమే.

సా: తేలేదటే పాపం, పోనీ రేపిస్తారులే.

వే:మా: ఏడిశావులే. అందరూ మంచివాళ్ళే. నీకు తెలియదు,

చిన్న దానవు. అలా డబ్బు లేకుండా ఎక్కడికీ వొప్పు
కోకూడదు. మనమనగా, ప్లీడర్లనగా, డాక్టర్ల
నగా ఉరువు వొప్పుకోకూడదు. ఫీజు ముందు పుచ్చు
కోవాలి గాని.

నా: పోనీలేవే పాపం రేపిస్తానంటే వొప్పుకోపోతే ఎట్లా
ఎంత భోగంవాళ్ళమయినా? నిన్న చూడూ ఆయన
పదిహేను రూపాయిలు ఇచ్చేడని వొప్పుకున్నావు.
నీకే, నాకు తెల్లవర్లూ భగవంతుడు కనిపించాడు.

వే:మా: నేనూ అనుభవించాను నా కాలంలో. మోటూ తా
టూ వోపికపట్టాలి. లేకపోతే యెట్లా డబ్బు?

నా: సరేగాని యీ వేళకు యీ కుబ్బ్న వుండనియ్యవే,
పన్నెండు ఘంటలకు వెళ్ళిపోతారుట కూడాను ఏదో
పనిమీద. కులాసాగా గడపనీ ఆయనతోటి యీ
వేళకు అని ముఖం బుడాయించుకొని గారాలు కుడు
స్తూవుంటే కష్టంమీదవొప్పుకుంది వేశ్యమాత. రేపు
తప్పక సొమ్ము కుంపించమని చెప్పు' అని సాహసం
తో చెప్పి ఆ ప్రక్కకు మరొక సరసుడు సాహసం
అక్కకోసంవస్తే మాట్లాడ్డానికి వెళ్ళిపోయిందా సర
సుడితో వేశ్యమాత. ఆ సరసుడికి నలభై యేళ్లుం
టాయి. సిరిగలవాడేనని వుంగరాలు శీవీ చెపుతు
న్నాయి. వలంగాను బలంగాను వున్నాడు. ఏదో ఒక
రేటుకు బేరం కైటలు అయింది. ఆ ప్రక్కగదిలోకి
సాహసంఅక్క వెళ్లిపోయిందా సరసుడుతో కాని
యివతల గదిలోకి సాహసం ముకుందరావు ప్రవేశిం
చారు. ఆవచ్చిన కొత్తసరసుడు ముకుందరావు ఇం

ధూకోటి లోనివాడు.

ము: సాహసం, ఆగదిలో వాళ్ళు ఏం మాట్లాడుతున్నారో వినాలని వుందినాకు.

సా: ఏం? ఆలాంటి మనసు పుట్టింది?

ము: ఏమీ లేదు. అతడు మా బంధువుడు. మీ రక్క చాల ఆపాయకరమైన మనిషి అని అంటారు. ఏమవుతుందో చూదాం. అతనీవృత్తి క్రొత్తగా ప్రారంభించాడు యీమధ్యనే భార్య పోయింది, మళ్ళీ పెండ్లి చేసుకో లేదు. ఆరితేరిన జాణతో క్రొత్త సరసుడు ఎట్లా సంభాషిస్తాడో వినాలని సరదాగా వుంది. వినుపిస్తుందా మనకు వారిసంభాషణ?

సా: అయితే యీలారండి యీప్రక్కను నిలబడితే ఆకిటికీ తెరచివుంది. దానిద్వారా మాట వినిపిస్తుంది. దృశ్యం కనుపిస్తుంది. అని వికటంగా నవ్వి ఆచేరువకు తీసుకువెళ్ళింది. వారి మాటలు వీరికి యిలా వినుపిస్తున్నాయి.

సర: నీ పేరేమిటి?

పం: నా పేరు పంకజాక్షి.

సర: పంకజాక్షా? చక్కని పేరు. రా అని చెయ్యి పట్టుకుని మంచంమీదకు లాగేడు. పంకజాక్షి నవ్వుతూ మీ దేవూరండీ?

సర: క్రిష్ణాపురం. నాకు భార్యపోయింది. ఒక మనిషిని ప్రాకశం చెయ్యాలనివుంది. నువ్వుంటావా?

పం: మీస్థితిగతులు!

సర: నాకు సాలుకు ఇరవై వేలొస్తాయి. అంటే వేశ్య

మిక్కిలి ఆశపడింది.

పం: ఏదో తప్పదని వృత్తి చేస్తున్నాము గానండి మీలాంటి గౌరవనీయుల ప్రాపకం వద్దంటానా? చాలా మంది నన్ను ఇదివరకిలా అడిగేరు. చాలా గొప్ప గొప్ప జమీందార్లే. ఏమంటే చూడండి వుంచుకున్న దాకా తొందర. ఇంకక్కడనుంచి అన్నిటికీ యిబ్బంది పెడతారు. ఒకరి ప్రాపకంలోకి వెళ్లేక కార్యకన్నా అదనంగా కాపురం చెయ్యాలాండి? ఇక బయిల్దేడి రాబడివుండదు. ఇంత నీతిగా ప్రవర్తించినా వారది గుర్తించుకోరు. డబ్బు ఖర్చుపెట్టడానికి ముఖం చూచుకుంటారు.

సర: నే నలాచెయ్యనులే. నీకే యిబ్బందీ గాకుండా చూస్తాను. మనము ఏమీ కొనుక్కోనక్కరలేదు అన్నీ మనకే పంపుతాయి. నీకు ఒక బంగాళాయిస్తాను. అందులో వుండువుగాని. బట్టలే కొనుక్కోవాలి. తతిమ్మావన్నీ ఇంట్లోనేవుంటాయి. మావూళ్లో కాఫీ హోటళ్లు వుండవు. టిఫిను, కాఫీ ఇంట్లోనే చేసుకోవాలి. ఒక వంటమనిషినికూడా ఏర్పాటుచేస్తాను.

పం: మీరు చెప్పింది చాలా బాగుంది. చిన్నతనంనుంచీ పట్నవాసంలోవున్న మేము పల్లెటూళ్లో వుండలేమండి. ఇక్కడే నన్ను యీ ఇంట్లో వుంచడానికి మీరా కిష్టం లేకపోతే, ఇంక ఇక్కడ వుండకూడదు కూడా లెండి, ఒక బంగాళా కట్టించండి. అందులో నన్ను పెట్టి మీరు రోజూ వస్తూవుండవచ్చు. అది మీలాంటి పెద్దవారి కొక విధమైన దర్జా మాదిరి. భాగ్యవంతులకు పట్న

వాసాల్లో ప్రాకటంచేసిన సానులుంటారు. వారక్క-
డికి వస్తూ పోతూవుంటారు. అది అధిక ధనసంపన్ను
లకు అవసరమైన గౌరవము. అంతేకాని పల్లెటూళ్లో
వుండకూడదు. అది బీరాకూ మాకు గౌరవహాని కలి
గిస్తుంది మరిలేవండి. నాకుచాలా మనస్సుగావుంది
మిమ్మ్నలను చూసిన దగ్గరనుంచీ. అని పంకజాక్షి
జాకెట్టు తీసివేసి పైట క్రిందకు జారవిడిచింది, ఆమె
కట్టినది గ్లాస్కో చీరేమో శరీరంపైకి నీటిలో నీడలాగు
కనుపిస్తోంది. అతని రెండుచేతులూ పట్టుకొని
లేవదీసి శక్తికొద్దీ కౌగలించుకొని అతని హస్తాలు
తన వక్షస్థలాని కదుముకొని కుర్చీలో కూర్చొని
అతన్ని మీదకులాక్కొంది. అతనికిదంతా అలవాటు
లేదు. కొత్తగాను ఆహ్లాదకరంగాను వున్నట్టు తో
చింది అతన్ని నిలువుటద్దము దగ్గరకు తీసుకొనివెళ్లి
ముద్దుపెట్టుకుంది పంకజం. నిర్విణ్ణుడైపోయాడు
నూతన వ్యభిచారి. పాపం అతడిలాంటి ఎరుగడు.
పవిత్రంగా పల్లెటూళ్ళో భార్యతో కాపురం చేసు
కున్నవాడే కాని కొక్కోకం చదువుకున్నవాడు కాదు.
అతనికేసి చూచి కిలకిలా నవ్వుతూ మళ్ళీ అతని
ముఖం చూడలేక సిగ్గుచే తలవంచుకొంటూ వారగా
చూస్తూ విగతవస్త్రులుగా స్త్రీపురుషులువున్న ఫోటో
లు చూపిస్తూ "విరాకర్థం కావడంలేదా ఏమిటండీ!
అంటే అతడు ఎర్రిగానవ్వాడు. అత్రంగా చొక్కా
ఖమీసు తీసివేసాడు. చొక్కా ఖమీసు తీసివేసిన త
ర్వాత కు స్త్రీపట్టుతోనేమ వస్త్రాపులాగుట్టా ఈకారసుడు,

వ్యవసాయం చేసేవాడు. ఎక్కడ యే కండపుండాలో అక్కడ ఆ కండవుంది. విశాలమైన వక్షస్థలం రక్త పూరితమైన ముఖం. ఆవేళ్ళ ఆతని శరీరం సమ్మోహనాస్త్రంలా కనిపించగా వ్యుద్రేకితంగా అతన్ని పట్టుకొని ముందుకులాక్కొంది. ఇదంతా ముకుంద రావు చూస్తూనేవున్నాడు సాహసం చూస్తూనేవుంది. ఇంక కక్కడ నిలువలేక పోయినారు. వారి గదిలోకి వారు వెళ్లిపోయి రెండునిమిషాలు నిశ్శబ్ధంగా వూరుకున్నారు

సా: ఏమండీ కాళ్లుపట్టనా!

ము: కాళ్లు పడతానంటే వద్దంటానా! అని బుగ్గలుగిల్లేడు ముకుందరావు. కాళ్లు పడుతోంది సాహసం.

ము: ఇంక మామొట్టం మీ అక్కవల్లో చిక్కిపోయాడు. ఎంతపనిచేసిందో చూశావా? పాపమా పల్లెటూరు వానికి ఘట్టా లేమీ అలవాటు లేనట్టున్నె.

సా: పోనిద్దురూ మీరు మరీ కొంటివారుసుమండీ? అవును గాని యీరాత్రి దృశ్యాన్ని కథగా వ్రాసి అచ్చువేయి న్నారేమోనని భయంగావుంది నాకు. అంటే ముకుంద రావు నవ్వేడు.

సా: ఇలాగే అనేకమందిని మోసగించి డబ్బు వ్రాడుకుంటారు, చూడండీ పల్లెటూరు వద్దు ఇక్కడికే. వుంధా మంటోంది. అక్కడైతే దీనిఅట్లు సాగిరావనీ డొక్క చీరుస్తారనిన్ని.

అంటే ముకుందరావు నవ్వుతూ

ము: మీ అక్కకి వ్యతిరేకంగా మాట్లాడుతున్నావు.

సా: తప్పు తప్పుకాదండీ!

ము: ఏమిటో తప్పా సాహసం ? నీకు తెలియదు. చివరకు పాడయ్యేవాళ్ళు మీరే. ఏ యువకుడైనా యువ్వనోద్రేకం సరదా వున్నంతకాలమే, మీ దగ్గరకువచ్చి ధనం వెచ్చిస్తాడు. ఆ తరువాత వాడిదారిని వాడు పోయి మీ మొగమైనాచూడడు. వాళ్ల సంఘంలో వాళ్ల ఇంట్లో వాడు చేరుకొని మళ్లీ సుఖంగా కాపురం చేసుకుంటాడు. మీకు యవ్వనంలో వచ్చేడబ్బు అలంకారానికీ డాక్టర్లకి సరిపోతుంది. వృద్ధాప్యంలో ఏపిల్లనో చేరదీసుకొని జీవించవలసి వస్తుంది ఏమీ ఆధారముండదు. చివరకు పాడయ్యేవాళ్లు మీరే. ఇప్పుడు మీ అమ్మవున్న పొజిషన్‌లో నువ్వూ వుండవలసి వస్తుంది కొన్నాళ్లకు. మీరు గడించేది ఏమీ వుండదు. ముసలితనంలో నల్లమందుకే ఇబ్బంది పడతారు. కడకు మీరు పెంచుకున్న పిల్లలకు పరిచారికలుగా మారిపోతారు. గాని మాతృగౌరవం పొందలేరు. భోగంజాతి దుర్మార్గపుజాతి అంటారు గాని నిజానికి మిమ్మల్ని ఈ స్థితిలో విడిచి స్త్రైన తీమట్టు కుపయోగించుకొని జాలిలేకుండా పునరుద్ధరించకుండా వున్న మానవులే దుర్మార్గులు.

సా: మీ రన్నిట్లోనూ ఎదురీత్తే యీత్తారు.

ము: నిజమంతే నంటావా ?

సా: నిజమేనండి. సరసులంతా సౌఖ్యంగానే వుంటారు. కాసకు బొత్తిగా కళ్లుమూసుకు పోయిన ఏ కొద్దిమందో తప్ప. అయినా సానీ బాగుపడదు. సానీ సరసుడూ ఏ మద్యపాన దురభ్యాసానికో అలవాటుపడి వృథ

యులూ పాడౌతారు. అంతే, వేశ్యలు సాధారణంగా బాగుపడిన వారులేరు.

ము: రైట్. తదితర దురభ్యాసాలకుకూడా అలవాటుపడి పాడౌతారు పరుషులు. దానివల్ల వేశ్యలూ బాగుపడరు. ఆల్ రైట్ పండుకో.

అంటే అతని పక్కనే పండుకొంది సాహసం.

వృత్తిక్షణంలోనే సాహసం ముకుందరావు చిలిపి చేష్టల్ని వారిస్తూ

సా: అదేమిటండీ? పోనిద్దురూ నీరసంగా వున్నానన్నారు.

ము: పరవాలేదు.

సా: వొద్దండి. మళ్ళీ జబ్బుచేస్తుంది.

ము: అబ్జక్షన్ పెట్టకు.

సా: మీరుకూడా ఇలాఅంటే ఏంచెప్పను? మీరు ఆరోగ్యంగా వుండడమే నే నెప్పుడూ కోరుకుంటూ వుంటాను. నాకుమాత్రం మీతో సుఖించడం ఇష్టం కాదనా? సరేలెండి అని ఆమోదించింది. ముకుందరావుని సాహసం ప్రణయకేళీ సంరంభానికి. కొంతసేపటికి సాహసంతో.

ము: మనము యిప్పుడు చూచినదృశ్యం మూలాన్నికాని లేకపోతే వూరుకుందామనే అనుకున్నాను.

సా: గొప్పపని చేశారు.

కొంతసేపైన తరువాత అప్పటికే అనారోగ్యంగా వున్న ముకుందరావుకి కండ్లు తిరగడం ప్రారంభించాయి. పాపం నీరసంగా మూలుగుతున్నాడు సాహసం ప్రక్కలోవున్న ముకుందరావు. సాహసం జాలిపడింది.

రణంగా పేదతనంలో పిల్లలను పెంచలేక దారిద్ర్య బాధ సకల శాస్త్రాన బంధాలను త్రెంచి వెయ్యగా నిరుపేద వారు కన్నపిల్లలను పోషించలేక అమ్ముకుంటారు. అది మహాదారుణమైన విషయమే కావచ్చు కాని ఆర్థికంగా వెనుకబడిన అన్నాతురులలో అది బాహాటంగా సాగుతూనే వుంది. అటువంటివారిదగ్గర డబ్బుకు పిల్లలను కొని వేశ్యలు ముసలితనంలో ఆధారంకోసం పెంచుతారు. వాళ్ళు పెరిగి పెద్దవాళ్ళై పెంచిన తల్లి ఋణం తీర్చుకుంటారు. అది వారి పరస్పరసంబంధం.

ము: ఆదేమిటి? మీతల్లిని తిడుతున్నావు తప్పు.

సా: తప్పా గిప్పానూ! అందరిదగ్గరకీ వివక్షత లేకుండా వెళ్ళమంటుంది. కొంచెం యవ్వనం, నాగరికత, నాజూకూ వున్న వాళ్ళదగ్గరకైతే వెళ్ళగలంగాని ఎంత వేశ్యలమైనా ధనప్రధానంగా ప్రతీ పశువుదగ్గరకూ వెళ్ళగలమా చెప్పండి? మీరెప్పుడొచ్చినా ఏడుస్తుంది. నేను పేచీ పెడతానని భయపడుతుందంతే. ఎవరిమీదన్నా కూతురికి ఇష్టముంటే వారితో సంబంధానికి వేశ్యమాత ఒప్పుకోదు. వాడితో పోతుందనో, వాడికేమన్నా డబ్బు పెడుతుందనో భయం. వుండండి, కదలడానికి వీలులేదు. మీరిక్కడే వుండాలి తెల్లవారిందాకా.

ము: నిజమే సాహసం. నేను చాలమంది సానుల్ని ఎరుగుదును. కాని నువ్వంటే చాలా గౌరవాభిమానాలు, దానికి నీ అందచందాలు కాదు కారణం. ; అందంమీద అట్టే అభిమానం వుండదు నాకు. నీ[illegible] కాదు

కారణం నాకు. మీ యవ్వనంలోని ప్రథమఘట్టాలు దాటిపోయినా నీ సుగుణాలూ, ఎక్కువ కపటంగ లేక పోవడం, నేను మెచ్చుకుంటాను. వృత్తివిరుద్ధంగా నాపట్ల నీవు డబ్బడుగకుండా సంచరిస్తావు, అందుకే ఇంకా నీతో సంబంధం వొదల్లేకపోతున్నాను. అంటే సాహసం ఆనందపరవశురాలై అతని మీదపడి బిగియార కౌగిలించుకొని ముద్దు పెట్టుకొని.

సా: నిజంగా మాజాతిలో నాకు 'మీమీద ప్రేమ' అన్న మాట పరిపాటైపోయి విలువ లేకుండాపోయింది. అంచేత ఆమాట ఇప్పుడు నేనూ అనకూడదు. కాని నిజంగా నామనోభావం చెప్పాలీ అంటే నాకు మీతోటే నిత్యమూ సుఖిద్దామని వుంటుంది. హృదయం మీ క్షేమానికై ప్రబలాట పడుతుంది. మీ మనస్సు, వుద్రేకము, బుద్ధివికాసమూ ఎరుగుదును. అర్థంచేసుకున్నాను. మన నాలుగేండ్ల సంబంధంలోనూ నాకు మీదగ్గర లభించిన సుఖం, వుత్సాహం, విజ్ఞానం, ఎవరిదగ్గరా లభ్యంకాలేదు.)

ము: అనురాగంతో అలా అంటున్నావు. సరే, నేపోతాను మరి. మళ్ళీకలుసుకోవచ్చు కనుంది. తెల్లవార్లూ వుంటేమాత్రం తెల్లవారక మానుతుందా చెప్పూ. అని లేవడానికి వుంకించాడు. ఆతన్ని అదిమిపట్టుకుంది.

సా: నామాట వినరన్నమాట.

ము: వింటాను. నీకు సమయం తెలియదు. నన్నుపోనీ నామాట నువ్వు మాత్రం వినకూడదూ!

సా: అదికాదండి! అర్ధరాత్రివేళ వొక్కడకు వెళతారు!

ఇక్కడుంటే పరిచర్య చేయవచ్చునని.

ము: ఇంటిదగ్గర మా చెల్లాయితో క్లబ్బులో పనివుందని చెప్పివచ్చాను. మనం యీ పనిలో పడ్డాం. ఇప్పటికైనా ఇల్లు చేరుకోకపోతే ఆడిన అబద్ధం కట్టదు.

సా: మహా రోజూ ఇంటిదగ్గరే పండుకొని అదుపులో వుంటూన్నట్టు చెపుతారేం?

ము: యీమధ్య నీరసంగా వున్నదగ్గరనుంచీ ఇంటిదగ్గరనే వుంటున్నానులే. వెలువడ్డానికి వేళే విఘ్నేశ్వరపూజ చేశాం.

సా: సరే, కాకనే కాదంటే నేనేం చెయ్యగలను? వుండండి. నడిచివాళ్లేరు బండిపిలిపిస్తాను.

అని బండిపిలిపించి ముకుందరావును పంపించింది అప్యాయంగా సాహసం.

ముకుందరావు భోజనానంతరం ఇల్లు విడిచివెళ్లి దగ్గరనుంచీ లీలావతికి అతని ప్రవర్తన విషయంలో అనుమానంగానే వుంది. తిరిగి అన్నయ్య దుష్ప్రవర్తనకు లోనగుతున్నాడేమో తెలుసుకోవాలని కుతూహలం కలిగి ముకుందరావు క్లబ్బులో వున్నాడో లేదో, తెలుసుకుందామని ఒక కుర్రవాణ్ణి పంపించి వాకూబు చేయించగా అక్కడి ముకుందరావు స్నేహితులు అతడక్కడికి రానేలేదని ఆవేళ వారెవ్వరికీ అతడు కనబడలేదనీ తెలిసింది. దాన్తో ఆమె అనుమానం దృఢపడింది, తదనుగుణ్యంగా అతడు రాత్రి ఒంటిగంటదాకా తిరిగిరాలేదు. యీ సంగతేదో అతన్ని అడిగి తెల్సుకోవాలని దూరలవాట్లనుంచి అతన్ని తప్పించా

లని పట్టుదలతో అతడొచ్చేవరకూ మేలుకొనేవుంది. ముకుందరావు ఇంటికి కొంత దూరంలోనే బండీదిగి పోయి నెమ్మదిగా ఇంటికివచ్చి తలుపు కొట్టీకొట్టడంతోనే లీలావతి తలుపుతీసింది. అతడు లోపలికి ప్రవేశించగానే నెమ్మదిగా ఇతరులకు వినుపించకుండా ప్రశ్న పరంపర కురిపించింది.

లీ: ఏమన్నయ్యా! ఇంతసేపున్నావు క్లబ్బులో?

ము: ఏమన్లేదమ్మా వొంటిగ్తేగా?

లీ: ఎవరూ?

ము: ఇంకెవరూ స్నేహితులు.

లీ: క్లబ్బులో ఇంతసేపటిదాకా వుంటారా అంతా?

ము: ఏదో వుత్సాహంగా వుంటూవుంటారులే.

లీ: క్లబ్బులో ఏమయినా ప్రత్యేకంగా గదులుంటాయా ఏంటన్నయ్యా?

ము: ఒకే ఒక హాలుంటుంది. అందులో అంతా ఆడుకుంటూ పాడుకుంటూ వుంటారు.

లీ. మరి మన కుర్రివాడు వచ్చినప్పుడు నువ్వేదో మూలకు కూర్చుని పేకాడుతున్నావటగా?

ము: నేను పేకాడనూలేదు. మన కుర్రివాడు రానూలేదు (అన్నాడు చిరాకుగా)

లీ: నువ్వు క్లబ్బుకు పోనూలేదు.

ము: పోకే.?

లీ: మన కుర్రివాడు రాకే.?

ము: ఎప్పుడొచ్చాడు?

లీ: నువ్విక్కడ లేనప్పుడు. ఎందుకన్నయ్యా నా దగ్గర

అబద్ధాలు. ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చడానికి వంద అబద్ధాలాడే కార్యక్రమం కట్టిపెట్టి నిజంచెప్పు, నే నెవ్వరితోనూ అననులే.

ము: చెప్తా వు. నిజమే. పూరికే సరదాగా అలా

లీ: అలా అప్పురూపవతుల ఇంటికి వెళ్లేవా?

ము: అలా పూర్వ పరిచయంవున్న వేశ్య సాహసం ఇంటికి వెళ్లాను క్షమించు.

లీ: సాహసం ఇంటికి వెళ్లేవా? మంచి సాహసం చేశావే?

ము: అందుకే చెప్పను మన్నించవు.

లీ: మన్నించడం కాదన్నయ్యా! అందరూ నీకులాగే జ్వరంతో శృంగార విహారం చేస్తున్నారా?

అని లీలావతి ముకుందరావుని మందలించింది. తరువాత ముకుందరావు రెండుమూడు రోజులు జ్వరపడ్డాడు, పత్యంపెట్టేక విశ్రాంతి తీసుకుంటున్నాడు. చెల్లాయి శ్రద్ధా భక్తులతో సకలోపచారాలు చేస్తోంది. ఇప్పుడామెకు అన్నయ్యంటే అపరదేవత. కాళ్లు పట్టడము, కాఫీ ఇవ్వడం, పండ్లరసం ఇవ్వడం మొదలైన పనులన్నీ తల్లీ పరిచారిక అక్కరలేకుండా తనే చేస్తోంది. తల్లి పిల్ల అలా అందివచ్చి ముకుందరావుకు పరిచర్య చేస్తున్నందుకు మిక్కిలి సంతసించింది. తల్లికి ముకుందరావంటే యెక్కువ వాత్సల్యము. ఏ కొడుకు తలిదండ్రుల దృష్టిలో నిరర్థకుడో అతనిమీదనే వారికెక్కువ ప్రేమవుంటుంది. పత్యం తింటున్న ముకుందరావుని తేల్చాల్పడానికి పగలు లీలావతి భారతము భాగవతము చదువుతుండేది.

ము: అది యేం పుస్తకం చెల్లాయీ? ఎప్పుడూ భాగవతం భగవద్గీతా చదువుతావేంటి చెవులు గింగురుమనే టట్లు?

లీ: పోనీలే నా గొంతుక శ్రావ్యమయిందీ మధురమైందీ కాదు.

ము: అదికాదే చెల్లాయీ! నీ గొంతుక చాల చక్కనిది. సంగీత కళా నైపుణివి. సుబ్బలక్ష్మికన్న చక్కగా పాడు తావు. అటువంటి గొంతుకను నిరర్థకంగా చక్కటిర గని భాగవతాది మహాగ్రంథ వృత్తాలకుపయోగిం చడ మెందుకూ? చూడు చక్కనిపాట లేకపోతే ఏ సమాసఘటనా భారమూ లేకుండా మహాదుపద్రవ ప్రవాహంలో లేని సెలయేటి నీటివలె నడచు నవ కవుల పద్యాలుచదవరాదూ? పాటలు పాడరాదూ?

లీ: అదేమిటన్నయ్యా! భావగంభీరమై భీకర సమాస ఘటనా నైపుణ్యాన్ని వెల్లివిరిసి సువర్ణాభిషేకాది సర్వ మాహాత్మ్యాలు పొంది, బిరుదాంకితులూ, పూజనీయులూ అయిన కవుల గ్రంథాలుకూడా హే యంగా చూస్తావేమిటి?

ము: అబ్బా! ఇంతసేపూ పొగడి ఇంకొక్కటి మరచిపో యేవే చెల్లాయీ!

లీ: ఏమిటో? అంతా వెటకారమే.

ము: అప్పటి కవులకు శాపశక్తికూడా వుండేదట. ఏ రాజై నా డబ్బు ఇవ్వకపోతే శపించిపారేశావారట.

లీ: ఆ వూరుకుందూ. పోతరాజు ఎవ్వరిదగ్గరా చిల్లిగవ్వ పుచ్చుకోలేదు.

ము: నవకవులు చాలమంది వున్నారు. వారు కేవల భావ ప్రధానంగా రాస్తారు. నిరర్థక వ్యాకరణంతోటి పదాడంబరం కోసం యెక్కువ బాధపడరు. ఒకరచన వుందీ అంటే దానికి ఒక పనివుండాలి. (Purpose) సాధ్యమయినంత మట్టుకు వాస్తవిక విషయాన్నే తీసుకొని దానికి కొంచెం కవిత్వపు మెరుగుపెట్టి కేవల కవి కల్పితం కాకుండా రాయాలి. ప్రపంచంలో జీవిస్తూ తదితరమైన వూహాప్రపంచాన్ని సృష్టించి రాయడం నిష్ప్రయోజనం. చదువరుల కుత్సాహము, మార్గదర్శకము, సలహా, ధైర్యము, వుపాధ్యాయుడు, ఆచరణ సాధ్యము అయివుండాలి రచనలు. అంతేకాని ఒక నవయువతి స్వప్నంలో ఒక పురుషుణ్ణి చూసింది అతడు అపూర్వపురుషుడు అతన్నే ప్రేమించింది. అతడెక్కడా కనుపించలేదు. కడకు అరణ్యాలలో కనబడ్డాడు. అతనికీ ఆమెకీ వివాహమయింది. అత డల్పాయుష్మంతుడు. కాని ఆమె పాతివ్రత్య ప్రభావంచేత చనిపోయిన భర్తను బ్రతికించుకొని దీర్ఘాయుష్మంతుణ్ణి చేసింది. అని ఎప్పుడో రాయబడిన కథకే తిరిగి అనేకమంది అనేకరూపాల్లో ప్రాణంపోస్తే అది ఎవరి కుపయోగపడుతుంది. ఎవరి జీవితానికి పోలికగా వప్పుకుంటుంది. ఎవరికి వైజ్ఞానికంగా తోడ్పడుతుంది. ఆ పురాణపద్ధతి మాని ఇప్పుడేదో వుద్రేకమంటూ రాస్తున్నారు. వుద్రేకం విమర్శకు చోటియ్యదు. వుద్రేకం తాత్కాలికం. యవ్వనోద్రేకంలో వున్నవాడు ఒకగోడను చూసి యిది స్త్రీ అయితే బాగుండు

పసు కుంటాడు. కొంపతీసి వాడు కవిఅయిత్తే దానికే రచనారూపం ఇస్తాడు. మరునాడు వాడే సుఖరోగ పీడితుడై స్త్రీజాతి లోకంలో లేకపోతే బాగుండునని ఒక గేయం రాస్తాడు. ఇవి రెండూ కవిత్వాలే అయిత్తే ఇక వేరే చెప్పేదేముంది. అటు (Utopian) కేవల మానసవాతీతం కాకుండా, ఇటు (Emotion) ఉద్రేకమూ కాకుండా, జగత్తులో జరిగిన, జరిగే విషయాలను కాక ఇలాజరిగితే సర్వజనానంద సందాయికమవుతుందని రాయాలిగాని నేలవిడిచి సాముచేస్తే ఏమిట్లా? ముఖ్యంగా చెల్లాయి; లోకంలో మానవోపకారి యెవడూ అంటే రచయిత. ఆ రచయితలు పూర్వం మతప్రాబల్యం హెచ్చుగావున్న రోజుల్లో తదనుగుణ్యంగా రాస్తూవుండేవారు. మతవిద్వేషాలతో కుంగి వెనకబడిపోతూన్న ప్రస్తుత కాలంలో మాటికీ గుడ్డికీ అధికసంఖ్యాకులు ఇబ్బందిపడే యీ శతాబ్దాలులో అయిక్యమత్యాన్ని సూచించే, తరగతి చైతన్యాన్ని కలిగించే, యేకతరగతిగా మానవులను మార్చే సామాజిక పద్ధతులు, సహకార పద్ధతులూ సూచిస్తూ రచించాలి. రష్యా స్వార్థపరతాలోకంలో నామ్యభాగంగా మారిందా అంటే దానికంతకూ Tolstoy మొదలైనమహారచయితలరచనలేతోలుదోల్తు పునాదులు. రష్యాదేశంలో రచన ఒక నూతన శఖాన్ని పొందింది. ఎక్కువమంది యదార్థ విషయానికి కథారూపమిచ్చి చదువర్లకింపుగాను, మార్గసూచికంగాను రాస్తారు. మరికొందరు విషయాలను అతి

రాలా యదార్థంగా రాసిపారేస్తారు వారూ, సామా జిక ప్రయోజనాలు గురించి రాసేవారు. అప్పుడే చదువర్లకు పరిణామంకలిగి సర్వశ్రేయోభిలాషులుగా మారుతారు. అంతేకాని ఒకకాలంలో మానవ సంఘం ఒక నియమిత పరిస్థితులలో వున్నప్పుడు అప్పటి అవసరాలను గురించి రాసిన ధర్మాలు, ధర్మ గ్రంథాలు, ఎల్లకాలం ధర్మాలుగాను సార్వకాలిక శాసనాలుగాను వుండలేవు. యీ కాలంలో మానవుడు పొందిన జ్ఞానము పరిమాణాన్నిబట్టి న్యాయం, ధర్మం రూపొందుతాయి. వర్తమానకాలంలో మానవులకు ఆచరణయోగ్యంగాను సాధ్యంగాను కనిపించే ధర్మాలు అనుసరించవచ్చును. తద్విరుద్ధంగావున్న వాటిని మార్పుచెయ్యవచ్చును ఆవిధంగానే రాజుకు రాజరికపు సాంప్రదాయపు హక్కులను పూర్వంవున్న విలువ లేకుండాపోయి ప్రస్తుతం ప్రజానుమతితో రాజరికం సాగిస్తున్నారు. ప్రజలే ప్రతీదేశంలో అధికంగా ప్రజలు వెనుకపడిపోయేకొద్దీ నానా అనేక అవసర పరిణామాలు అనేకచోట్ల కలుగుతున్నాయి. గొడ్రాలుముఖం చూడకూడదనే హిందూదేశంలో ఆహారం కొరతకాగానే 'సంతాన నిరోధం' ఒక బలమైన అవసరంగా యేర్పడ్డది. ఇంకా అనేక రాజకీయ సాంఘిక పరిణామాలను సాధించడానికి, మానవుని విజ్ఞానం పెంపుచెయ్యడానికీ లోకంలో అన్నిచోట్లా ఆర్థిక సమానత్వం సాధించడం అందరికీ లక్ష్యమైంది. అది అవసరంకూడా; పై విషయాలనూ, ఇంకా అనే

క ఇతర విషయాలను అనుబంధించి వాస్తవిక రచనలు వెలువడితే అందరికీ ముఖ్యంగా నిరుపేదలకుప యోగకరంగా వుంటాయి.

లీ: అన్నయ్యా, నువ్వు రాసిన పుస్తకం యదార్థమేనా?

ము: కథాభాగం యదార్థమే. కాకపోతే కొంచెం మెరుగు పెట్టేము. అంతేగాని ఇత్తడికి మెరుగుపెట్టి బంగారమన లేదు.

లీ: రాధ చచ్చిపోవడం నాకు సుతలామూ ఇష్టంలేదు.

ము: నీకు ఇష్టం లేకపోయినా ఆవిడ చచ్చిపోయిందిగనుక చచ్చిపోయిందని రాశాం.

లీ: పాపం ప్రభాకరావుకి సుఖించే యోగంలేదు అటువంటి సుగుణవతితో.

ము: ప్రభాకర్రావు ధనవంతుడైతే రాధను ఆసుపత్రి నుంచి తీసుకువచ్చినదగ్గరనుంచీ సక్రమంగా సంరక్షించుకోగలిగితే సుఖించగలుగును. డబ్బులేనిమనిషి. ఆమెను పురిటిసమయంలో ప్రత్యేకంగా పెట్టి రక్షించుకోలేకపోయాడు. అంచేత్తే ఆమె చచ్చిపోయింది.

లీ: అదేమిటన్నయ్యా, ఆమెయోగ మట్లావుంది?

ము: యోగంలేదు, నీముఖంలేదు. అనేక మోసాలుచేసి ధనం సంపాదించి ఆ ధనాన్ని ఖర్చుపెట్టుకొని సుఖిస్తున్నారు. వారికి యోగం బాగున్నట్టే లెక్కా? పిచ్చి భ్రమపడకు చెల్లాయీ. యోగం, మతం, పూర్వజన్మకర్మఫలం, ఇవన్నీ ధనికతత్వానికి ప్రచారాంగాలు. ఇటువంటి మూఢవిశ్వాస బంధాలచేత సాధారణప్రజలు కట్టుబడగా వారికష్టంతో కలిగించిన

సుఖాన్ని కొద్దిమంది నిర్దయగా దోచుకుంటున్నారు. అల్పసంఖ్యాకులు లోకంలో వారు చేయవలసినపని అధికసంఖ్యాకులచేత చేయించుకుంటూ ఆవిధంగా వారికష్టాన్ని కష్టతరంచేసి సుఖాన్న౦తటినీ కృత్రిమంగా దోచుకుని వారూ, వారిపిల్లలూ అనుభవిస్తున్నారు. ఇదీ రహస్యం, ఇది అనేకసార్లు నీకు చెప్పినా మళ్ళీ మొదటికొస్తున్నావు.

లీ: నిజమే అన్నయ్యా. అన్నీ ఆర్థిక సౌష్టవంమీదనే ఆధారపడి వున్నాయని గ్రహించినప్పటికీ అలవాటు దోషంకొద్దీ అలాయోగం అని కర్మంఅని అంటున్నానుగాని వుద్దేశపూర్వకంగాకాదు. ఆర్థికసమానత్వం మానవసాంఘిక పరిణామానికి పరమావధి. ఇంతలో ముకుందరావు స్నేహితులు ముకుందరావుని చూడ్డానికి వస్తే లీలావతిలేచి లోపలికి వెళ్ళిపోయింది.

1 స్నే. ఏలావుందోయి ముకుందరావు?

ము: కొంచెం బాగానేవుంది.

2 స్నే: ఏమిటి ఎవరితో కబుర్లు చెవుతున్నావు?

ము: మా Sister తో.

1 స్నే: దేన్నిగురించి?

ము: అచ్చే దానికి రచన అంటేయేమిటో చెవుతున్నాను,

2 స్నే: నీకథ వుండాలి దాన్నేంచేశావోయి?

ము: అదే చెప్పేను మాలీలకు దానిమీదే Criticism యిచ్చాడు.

1 స్నే: ఆకథ చక్కగావుందోయి చదవడానికి చాలా అహ్లాదకరంగా వుంటుంది. అచ్చువేయించరాదూ?

ము: వేయిద్దాం ఆర్థికపరిస్థితులు బలంగా అడ్డుతగులు తున్నాయి.
అది తర్జుమా చేయించాలి ఇంగ్లీషులోకి.

1 స్నే: చేయించాలి లేకపోతే మన ఆంధ్రదేశం అవతలికి పోలేదు కథ.

2 స్నే: ఎవరిచేత తర్జుమా చేయిస్తావు?

ము: ఎవరో కొంచెం కట్టుదిట్టంగా రాయగలవారిచేత.

1 స్నే: నువ్వే రాయవోయి లేకపోతే అఘోర్నరాదు.

2 స్నే: ఇంగ్లీషుకూడా బాగుంటుంది నువ్వురాస్తే.

ము: చూదాం.

1స్నే: ఆకథ Auto (స్వీయచరిత్ర) కదూ?

2సే. ఆ కథానాయకు డితడేనోయి. రాధ చనిపోయింది. Died. అతనిచరిత్రే. అందుకే బావుంది చదివేవా నువ్వు అని మొదట స్నేహితునుద్దేశించి ప్రశ్నిం చాడు.

1స్నే: లేదోయి, విన్నానంతే.

2స్నే: అతనేచదివితే విన్నాను ఓమాటు, అని సంభాషించు కుంటూన్న స్నేహితులు మాటలు వింటూన్న లీలా వతికి 'ఆకథానాయకు డితడే అన్నమాటలు విద్యు చ్ఛక్తిలా శరీరాన్ని కంపింపచేశాయి. అంతవరకూ కథ అనుకుందే కాని లేక యదార్థమనుకున్నా ప్రభాకరావే ముకుందరావనుకోలేదు. 'నీలాంటి వాడే అన్నయ్యా' అనేది. ఆకథకు కారకుడు అత్య ణయం, విషాదం, అన్నీ అతనే అనుభవించి ప్రవ ర్తించిన వాస్తవిక ఘట్టాలనుకోలేదు. అందుకే

'అన్నయ్యా రాధాప్రభాకరాల ప్రణయసంరంభమూ ఏకాంతసల్లాపాలు, నీకెలా తెల్సు' అంటే చెప్తానులే అన్నాడు, అప్పుడు లీలావతి ఒకటి ఒకటీ జ్ఞాపకం తెచ్చుకుని తనసోదరునిగూర్చిన ఒకప్రేమగాధ వాళ్ళ తలిదండ్రులు చెప్పుకోవడం విన్న జ్ఞాపకం వున్నట్టు తెలుసుకుంది. అది ఆరేళ్ళనాటిమాట అప్పటికి లీలావతి చిన్నది,

అప్పుడు నేను చిన్నదాన్ని అందుచేత బాగా జ్ఞాపక ముంచుకోలేకపోయాను. యీ విషయము అన్నయ్యను ప్రశ్నించాలి అని లీలావతి సోదరుని స్నేహితులు వెళ్ళిపోగానే ముకుందరావువద్దకు వెళ్ళి ప్రశ్నించబోయేలోపున వాళ్ళ నాన్నగారు వచ్చి

నాన్న: ఏలావుందమ్మా అన్నయ్యకు?

లీ: సుళువుగానే వుందండి, యీవేళ కులాసాగానే మాట్లాడేడు,

నాన్న: మందిచ్చావా?

లీ: ఇచ్చానండీ.

నాన్న: డాక్టరు రాలేదా?

లీ: లేదు. రానక్కరలేదన్నాడు అన్నయ్య. ఎందుకు? తగ్గిపోయింది. మందక్కరలేదు.

సమాప్తము.